# సృజన

121

నవంబర్ 1981

ఆధునిక సాహిత్య వేదిక

మాసపత్రిక

శ్రీశ్రీ తో ఇంటర్వ్యూ

నెహ్రూపై పాబ్లో నెరూడా

రాంమోహన్‌రాజు గొల్లకథ

గంగారాంపై ఎ. ఎన్. కవిత

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20

ఈ సంచిక రు. 2

STOP PRESS

# అతనికంటె ఘనుడు

"ఇదివరలో పోలీసులు నక్సలైట్లను 'ఎదురుకాల్పుల' పేరుతో చంపేవారున్న ఇప్పుడింక వాళ్ళు వాళ్ళను భూస్వాములకు ఒప్పగిస్తున్నారు"- సిపిఐఎంఎల్ (ఆర్ ఒపి) కార్యకర్త నాగేశ్వరరావు హత్యపై వ్యాఖ్యానిస్తూ ఒక పౌరహక్కుల బాధ్యుడన్న మాటలివి. భూస్వాములకు ఎందుకు ఒప్పగిస్తున్నారు- నాగేశ్వరరావును ఎవరు హత్య చేసారో ఈరోజు పత్రికలుచదివిన ప్రజలందరికీ స్పష్టమే. ఒక్కమనిషి ప్రాణాలు తీయడానికి అదికూడ చేజిక్కి తమలాకప్‌లోవున్న ఒక పేద హరిజన యువకుని ప్రాణాలు తీయడానికి జిల్లా భూస్వామ్యవర్గానికి పోలీసు అధికారులకు ఎన్నెన్ని కట్టు కథల్ని కల్పించాల్సివచ్చిందో.

మానుకోట తాలూకా బలపాల గ్రామస్థుడైన నాగేశ్వరరావును అపూళ్లో భూస్వాముల గూండాలు పట్టుకున్నారు. కొట్టారు, చెట్టుకుకట్టేసారు. పోలీసులకు సమాచారం అందించారు. ప్రజలందరిముందే పోలీసులకప్పగించారు- నల్లబజారు నడుపుతున్న వర్తకున్ని శిక్షిస్తేనో, ప్రభుత్వభూములు స్వాధీనంచేసుకున్న దొరల్ని నిలవేస్తేనో 'చట్టాన్ని మీచేతుల్లోకి తీసుకుంటేఎట్లా?' అని ప్రశ్నిస్తారు పోలీసులు- మరి చట్టాన్ని అమలుచేయాల్సిన పోలీసుఅధికారులు, నిందితుణ్ణి కోర్టుకు అప్పగించ వలసిన పోలీసుఅధికారులు ఏంచేసారు- నాగేశ్వరరావును భూస్వామికి ఒప్పచెప్పారు- దొరికిందేతడవుగా భూస్వామిని పోలీసుస్టేషన్‌కు పిలిచి సర్కిల్ ఇన్స్పెక్టర్ నాగేశ్వరరావును ఒప్పచెప్పాడని మానుకోట ఊరుకోడైకూస్తున్నది. శవం మానుకోట సమీపాన శనిగరం బోడువద్ద పడివున్నదని జిల్లా సిపిఐ కార్యదర్శి ప్రకటించాడు. నాగేశ్వరరావును మానుకోటసమితి ఉపాధ్యక్షుడు అమృతరెడ్డి చంపాడని స్వయంగా జిల్లా ఎస్పీ ప్రకటించాడు- కాకపోతే 'ఆత్మరక్షణ'కోసం అనే రక్షాకవచం తగిలించాడు.

అయితే మరి పోలీసుకస్టడిలోవున్న నిందితుడు అతని శత్రువుచేతుల్లోకి ఎట్లా పోయినట్లు? (కస్టడీఅంటేనే నేరస్తుడు, నిందితుడు అయినాసరే అతని శత్రువు చేతుల్లోపడి ప్రాణాలు పోగొట్టుకోకుండా వుండడానికి చట్టప్రకారంగా విచారింపబడ డానికి ఇవ్వబడే పోలీసు లేదా జుడిషియల్ రక్షణ అనిఅర్థం) ఒక దినపత్రిక తెలుగు లోనూ, ఇంగ్లీషులోనూ రాసినట్లు సినిమాఫక్కీలో అందుకు సమర్థన అల్లడానికి వరంగల్‌జిల్లా ఎస్పీ రెండురోజులు మానుకోటలో మకాంవేయాల్సి వచ్చింది. 5వ తేదీరాత్రి హత్యజరిగితే 8వ తేదీనగానీ పోలీసులు పత్రికాప్రకటన ఇవ్వలేదు. అంటే ఈ 'థ్రిల్లర్ మూవీ'కథ అల్లడానికి జిల్లా పోలీసుఅధికారులకు, భూస్వాములకు వారి

మిగతా 3వ కవర్ పేజీలో....

121
నవంబర్ 1981

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక
మాస పత్రిక

| | |
|---|---|
| సంపాదకీయం | 2 |
| కవితలు : అమరత్వం - ఎ. ఎన్. | 46 |
| మృతవీరులకోసం కన్నీరుకార్చం - అనువాదం : టంకశాల అశోక్ | 48 |
| సింగరేణి కార్మికుడు - సూర్యం | 50 |
| శ్రీశ్రీతో ఇంటర్వ్యూ | 5 |
| వ్యాసాలు : "శాంతిదూత" నెహ్రూ - అనువాదం: ముదార్ వేణు | 41 |
| ఏసియాడ్ - 82 ఏనుగుపాదాల కింద | 61 |
| కథలు : గొల్లకథ - కె. రాంమోహన్ రాజు | 18 |
| సవారీ - తుమ్మేటి రఘోత్తంరెడ్డి | 28 |
| సింగరేణి కథలు: 3 - నిర్బంధంలోసమ్మె - కార్మిక | 31 |
| సమీక్షలు : ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి 1 - బాలగోపాల్ | 52 |
| రాబందులు రామచిలుకలు - సురా | 57 |
| సాహిత్య లేఖలు : | 66 |
| నాటకరంగం మీద అణచివేత-కేరళ 'జనకీయ సాంస్కృతిక వేది' ఖండన | 68 |

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002 for Venkataramana Mudranalayam, Warangal
Working Editor: Varavararao

# నిర్వచనం ?

భారత రాజ్యాంగం హామీ ఇచ్చిన జీవితము, భద్రత పరిరక్షించడానికి తనను జెయిలుకు పంపించవలసిందిగా కోరాడు ఏడు సంవత్సరాలుగా ఈడుస్తున్న సికిందరాబాదు కుట్రకేసులో నిందితుడు రామంచర్ల యాదవరెడ్డి. పోలీసులు ఉన్న పడిచెక్కదున్నుకోనివ్వడంలేదు, ఏ పనీ దొరుకనివ్వడం లేదు, చివరకు 'ఎన్‌కౌంటర్'లో 'అన్నల' దగ్గరికి పంపిస్తామంటున్నారు, కనుక బెయిల్‌రద్దుచేసి జెయిలుకు పంపించమని కోర్టును కోరాడాయన. అంతకన్న ఇంకేంచేసే అధికారాలులేని కోర్టు ఆయన కోరికమన్నించింది.

ఆయనింకా జెయిలుకు పంపించబడ్డవాళ్ళంతా క్షేమంగావుంటున్నారని బయళ్ళలో పొలాల్లో కష్టంచేసుకుని బతికేవాళ్ళే పోలీసుల లాఠీలకు, తూటాలకు గురియవుతున్నారని అమాయకంగా నమ్ముతున్నట్లు వున్నాడు. ఆయనకు బెంగాల్, బీహార్ జెయిళ్ళలో ఖయిదీల హత్యల గురించి, తమిళనాడు జెయిలులో మలమూత్రాల పాత్రల్లో పురుగులు లుకలుకలాడే తిండి గురించి తెలియకపోవచ్చు. కాని భార్య కళ్ళముందు భార్య గదిలోనే అరెస్టయిన రవీందర్‌రెడ్డిని తెల్లవారి ఖమ్మం కోర్టులో మరునాడు సూర్యాపేట మేజిస్ట్రేట్ ముందు హాజరుపరచాక, 'జుడిషియల్ కస్టడీ'లోనే పోలీసులు కాల్చివేసారని తెలియదా? ఆయన అరెస్టువార్త హైదరాబాదులో న్యాయవాదికిచెప్పి రిట్ వేయించాలని వెళ్ళిన భార్యకు ఆ న్యాయవాదే రవీందర్‌రెడ్డి 'మరణ'వార్త చూపించాడని తెలియదా? తెలుసు. కాని ఇంకా చట్టాన్ని గౌరవిస్తున్న వ్యక్తులను చట్టమేమీచేయదని అనుకుంటున్నట్లున్నాడు.

రహస్య జీవితంలో వుంటూ ఈప్రభుత్వాన్ని సాయుధంగా పడగొట్టాలనుకునే వాళ్ళ విషయంలోతప్ప పౌరులవిషయంలో ఈ చట్టం చాల సజావుగావుంటుందనుకునే వాళ్ళు చాలమంది చదువుకున్నవాళ్ళే వున్నారు.

పర్సయ్య తమ్ముడు ఇంటిపట్టునవుండే పిల్లవాడు. అతడు చేసిన నేరమల్లా అతనికి వయసు వచ్చింది. నోరు వచ్చింది. తన అన్న విషయంలో పోలీసులు చేసిన హత్యాచారాన్ని బయటపెడతాడని భయపడి అతణ్ణి జెయిల్లోపెట్టారు. యానాల చంద్రారెడ్డి తన కొడుకు నయపాల్‌ను చంపిన పోలీసులను కొడుకుశవం కళ్ళముందు వుండగానే కసితీరాతిట్టాడు, ఎదురించిమాట్లాడాడు. 'నీ కొడుకయితే ఏడ్వాలిగానీ, ఎదురించి మాట్లాడుతావేం' అన్నారు ఎన్నడూ ఎదిరించడమే అలవాటులేని పోలీసు

అధికారులు. స్థూపంకడితే కూలగొట్టాలని చూస్తున్నారు. సభ పెట్టుకోవడానికి అనుమతిలేదు. పెద్ది శంకర్ సంస్మరణ సభకు అనుమతిలేదు.

మన పిల్లల్ని వాళ్ళు చంపడమే కాదు, మన పిల్లల్ని మనం తలచుకోవడానికి కూడ వాళ్ళు అనుమతించరు. కడుపులో పేగు కదిలితే కలవరించే స్వేచ్ఛలేదు. మనసులో స్మృతి మెదిలితే కనుకొలకుల బాష్పధారలు నించుకునే స్వేచ్ఛ లేదు. మన కాళ్ళల్లో మసలి మన కళ్ళల్లో ఆడుతున్న పిల్లల్ని నోరారా తలచుకొని ఊరటో ఉత్తేజమో పొందేవీలులేదు. భారత రాజ్యాంగం ఇచ్చిన ప్రాథమికహక్కు కాపాడుకోవడానికి ఒక పౌరుడు తనను జెయిలుకు పంపించమని అడుగుతున్నాడు.

ఇది భారత రాజ్యాంగం ఇచ్చిన హక్కుకూడ కాదు. ప్రజలు రాజ్యాంగంలో తమ కొరకు తాము పొందుపరచుకున్న హక్కు కనుక ఈ రాజ్యాంగాన్ని, తమ సృష్టి ఐన రాజ్యాంగాన్ని రద్దుపరచే, మార్చే లేదా ధిక్కరించే అధికారం ప్రజలకు మాత్రమే వున్నది కాని ఈ రాజ్యాంగం ద్వారా అధికారంలోకి వచ్చిన ప్రభుత్వానికి ఏ మాత్రం లేదంటున్నారు న్యాయశాస్త్రం కూడ చదువుకున్న కాళోజీగారు. అంతేకాదు పొద్దునలేస్తే విదేశీ సహాయంకోసం హస్తం చాస్తున్న ఈ ప్రభుత్వానికి ఇక్కడ ప్రజలు చేస్తున్న ఆందోళనల్లో, పోరాటాల్లో 'విదేశీ హస్తం' వుందనే అర్హత ఎక్కడవుంది అని కూడ ఇటీవల ఆయన ఒక సభలో సూటిగా ప్రశ్నించాడు. తమ మనుగడకు ప్రమాదమనుకుంటే తమ దేశంలోకి ఆఫ్ఘనిస్థాన్‌లోవలె విదేశీసైన్యాలను ఆహ్వానించడానికి కూడ జంకని ఈ ప్రభుత్వాలకు 'విదేశీహస్తం' గురించి మాట్లాడే హక్కుకూడా వుందా అని కూడా అన్నారాయన.

ఆయన వివరించలేదుగానీ ఈ విదేశీహస్తం దగ్గర బిచ్చమెత్తడానికే కాలికి బలపంగట్టుకొని దేశదేశాలు తిరుగుతున్నది 'స్వతంత్ర' భారతప్రధాని. అంతర్జాతీయ ద్రవ్యనిధి దగ్గర అప్పుతెచ్చుకోవడానికి అది పెట్టిన అడ్డమయిన షరతులన్నీ ఒప్పుకున్నది. దేశంలో "అత్యవసర" సర్వీసుల్లో సమ్మెను నిషేధించే చట్టం దాని ఫలితంగా వచ్చిందే. ఈ దేశంలో తాను విదేశీ సహాయంతో నడిచే యంత్రంలో తన చేతులతో తనదైన కడుపుకోసం పనిచేసే కార్మికుడు సమ్మె చేస్తే ఆ సమ్మె వెనుక సంఘవిద్రోహ శక్తులు కనిపిస్తాయి. జాతీయభద్రతకు ముప్పు కనిపిస్తుంది. చాల సులభంగా ఆసమ్మె వెనుక విదేశీహస్తం కనిపిస్తుంది. అంతర్జాతీయ ద్రవ్యనిధి దగ్గర నిధులుతెచ్చి కోట్లకోట్ల రూపాయలతో మరోవిదేశం, ఫ్రాన్స్

దగ్గర ఆయుధాలుకొని పాకిస్తాన్‌తో యుద్ధంచేయాలి. ఇదంతా దేశస్వాతంత్ర్యాన్ని, సమగ్రతను కాపాడే పేరుతోనే. అందులోనూ 'పాకిస్తాన్‌తో యుద్ధం' అన్నది మన దేశంలో 'దేశభక్తుల' అంతరాంతరాల్లోంచి జాతిభావాన్ని పెనవేసుకుని పైకితెస్తుంది. తమ తమ దేశాల్లోని నిరంకుశ పరిపాలనలకు వ్యతిరేకంగా పోరాడుతున్న ప్రజలను తమదేశాలను సామ్రాజ్యవాదులకు తాకట్టుపెట్టి తామబానిసలై ప్రజల్ని బానిసలను చేస్తున్న ప్రభుత్వాలను ప్రశ్నిస్తున్న ప్రజలను 'సెంటిమెంటు' రెచ్చగొట్టి పరస్పరం యుద్ధాల్లోకిదిగేలా చూస్తున్నాయి ప్రభుత్వాలు. ఇటువంటి ప్రభుత్వాల ప్రతిష్ఠ కాపాడవలసిందిగా పోలీసులకు విజ్ఞప్తి చేస్తున్నాడు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి. చివరకు తమకు కావలికుక్కలుగా, కళ్ళు, చెవులుగా ఉపయోగపడుతూ ఇట్లా ఉపయోగపడుతున్నందుకు, ప్రజలకు, ప్రజాపోరాటాలకు వ్యతిరేకంగా రిస్క్ తీసుకుంటున్నందుకు 'రిస్క్ అలవెన్స్' అడిగిన పోలీసులను కూడ మోసంచేసింది ఈ ప్రభుత్వం. వాళ్ళ కోర్కెలన్నీ ఒప్పుకుంటున్నామన్నది. అందరినీ విడుదలచేసానన్నది. వాళ్ళకోసం 'సురక్ష' పత్రికకూడ ప్రారంభించింది. లొంగిపోని వారిని దిగజారని వాళ్ళను జైళ్ళలోనే ఉంచి బర్తరఫ్ చేసింది. తన యూనిఫా(ర)మ్‌ను కూడ వంచించే ఈ ప్రభుత్వాన్ని ఏ పేరుతో పిలవాలి?

అంతర్జాతీయ ద్రవ్యనిధికోసం, దేశంలోసమ్మెల్ని నిషేధిస్తే అది ప్రభుత్వం అవుతుంది. అది నల్లచట్టమన్నా ప్రజలు నల్లజాబితాలోకి ఎక్కుతారు. విదేశాల్నుంచి తెచ్చిన అప్పులను, ఆయుధాలను, శిక్షణను ఈశాన్యరాష్ట్రాల్లో పోరాటాలను అణచడానికి మిలిటరీరూపంలో ప్రయోగిస్తే అదిప్రభుత్వమవుతుంది. ఈశాన్య రాష్ట్రాల పోరాటాలనుబలపరిస్తే అది జాతి విద్రోహమౌతుంది. పోలీసులు 'ఎన్‌కౌంటర్ల' పేరుతో నక్సలైట్లను కాల్చివేస్తే అది 'ఆత్మరక్ష' అవుతుంది. అవమానపడుతున్న ఆత్మక్షోభ భరించలేక సంఘాలుపెట్టుకుంటే అది చట్టమవుతుంది. అయినా చట్టాన్ని గౌరవించేపౌరుణ్ణి చట్టమేమీచెయ్యదని హామీ ఇస్తుంది ఇందిరా ప్రభుత్వం. రౌలట్‌చట్టం పెట్టినప్పుడు బ్రిటిష్‌ప్రభుత్వంకూడ ఇలాంటి హామీయేఇచ్చింది. ఇంతకూ చట్టమనేది ప్రకృతిసిద్ధంగానూ, చారిత్రకంగానూ ప్రజలు పోరాడిసాధించుకున్న హక్కులూ విధులా లేక అధికారంలోవున్నవాళ్ళ కనుసన్నల్లో వాళ్ళకెప్పుడూ కన్నెర్ర కాకుండా మసలుకోవడమేనా?

7-11-81

— సంపాదకుడు

## 'విరసం పుట్టిన సంవత్సరం నా జీవితం అంతట్లోకి ముఖ్యమైన సంవత్సరం'

శ్రీ శ్రీ

(విరసం 'సాహిత్యపాఠశాల'లో పాల్గొనడానికి అక్టోబర్ 11న శ్రీ శ్రీ గుడివాడకు వచ్చినపుడు 'సృజన'కోసం 'సాహితీమిత్రులు' చేసిన ఇంటర్వ్యూ)

ప్రశ్న 1: విరసంలోవున్న యువతరంకవులు, రచయితలు సాగిస్తున్న కృషిపట్ల మీ అభిప్రాయం ఏమిటి?

శ్రీశ్రీ: అన్నీ చదవడం ఎలాగూ అసాధ్యం, కానీ తటస్థమైనంతవరకూ చూస్తూనేవున్నాను. విరసంకవులు ఎక్కడెక్కడో చెదురుగా ప్రచురణకావడంకంటే సృజనలోకానీ, అరుణతారలోకానీ ఎక్కువ కేంద్రీకరిస్తే బాగుంటుందని అనుకుంటున్నాను.

ప్రశ్న 2: ఇప్పుడు వీళ్ళు రాస్తున్న రచనలు విరసం ఆశయాలకు అనుగుణంగా వున్నాయనుకుంటున్నారా? ఏమైనా పెడధోరణులు కన్పిస్తున్నాయా?

శ్రీశ్రీ: విరసంఆశయాల్ని నూటికినూరుపాళ్లూ ప్రతిబింబిస్తున్నవాళ్ళు గద్దరున్నాడు, వంగపండు ప్రసాద్. మరి ప్రోజ్ పోయెంలోగానీ మినీకవిత్వంలోగానీ ఈ విధంగారాస్తూ కొంత అవగాహనాలోపంవల్ల విరసం ఐడియాలజీకి కొంచెం తప్పిపోతున్న రచనలుకూడా వస్తూనేవున్నవి. కానీ మొత్తంమీదచూస్తే నేటి యువకవుల్లో చెప్పుకోదగ్గశాతం విరసం ఐడియాలజీతో ప్రభావితులై నడుస్తుండటం కనబడుతోంది.

ప్రశ్న 3: చెరబండరాజుగారి సాహిత్యకృషిపట్ల మీ అభిప్రాయం ఏమిటి?

శ్రీశ్రీ: ఈరకం రచనలకంతటికీకూడా ఆద్యుడు చెరబండరాజనే నాఉద్దేశం. ఎన్నో విరసంసభల్లో అతను స్వయంగాపాడుతుంటే ప్రజలు ఉత్తేజితలూగడం నేను స్వయంగా చూసినవాణ్ణి. జానపదబాణీలో ఫార్మ్ ఫోక్‌లోరున్నా, కంటెంట్ రెవల్యూషనరీఅని ఏదైతే అనుకుంటున్నామో మొట్టమొదట దానికి దారి చూపించినవాడు చెరబండరాజేఅనిచెప్పి నేననుకుంటున్నాను.

ప్రశ్న 4: మీరు విరసం రచయితలనుంచి అప్పుడప్పుడు సంస్థఆశయాలకి భిన్నమైన రచనలు వస్తున్నట్టు అన్నారు. అటువంటివి తారసపడినప్పుడు ఒక సభ్యునిగా మీరు వాటిని సంస్థదృష్టికి తీసుకువచ్చే ప్రయత్నం ఏమైనాచేసారా?

శ్రీశ్రీ: అవి విరసంపత్రికలో అంటే అరుణతారలోగానీ, సృజనలోగానీ ఎక్కువగా కనబడవుగానీ ఇతరత్రా ఓ మంచిపోయెం ఆంధ్రజ్యోతి.... ఆంధ్రపత్రిక

పీక్లీలో పడిందనుకోండి. మరికొన్ని విరసం అభిప్రాయాలకి వ్యతిరేకంగా ఉంటాయనుకోండి. ఎన్నిటిననిమనం ఖండించగలం? ఈఉద్యమానికి సంబం ధించి రాస్తున్నటువంటివారిలో ఏమైనా కొన్ని పెడధోరణులు లాంటివి ఉన్నవీ అంటే మీరుచెప్పినట్టుగా వాటిని ఖండించొచ్చును. అంత ఖండించవలసినవి ఏమీ నాకు కనబడలేదు.

ప్రశ్న 5: ఈమధ్య తీవ్రవివాదం రేకెత్తించిన జ్యోతి ఆత్మహత్య, వీరేంద్రనాథ్ వ్యవహారంమీద మీ అభిప్రాయంచెప్పండి.

శ్రీశ్రీ: ఈ వీరేంద్రనాథ్‌వంటి రచయితలు పెట్టుబడిదారీ విధానంనుంచి వచ్చినటు వంటి- వెర్రితలలు వేసినటువంటి- విషరూపాలు. ఈ వీరేంద్రనాథ్ కాక పోతే మరొడురాస్తాడు. జ్యోతి ఆత్మహత్య చేసుకోవడంవల్ల ఇతను బజార్న బడ్డాడు. అంతేతప్ప ఈ రచనలు- అంటే- ఏమిటీ- మనం- ఒకవ్యక్తిని condemn చేయడంకంటే ఆ ధోరణుల్ని condemn చేయడం అవ సరమవుతుందని నేననుకుంటున్నాను. ఆ ధోరణిఎలాగూ తప్పదు, మన- ఈ పెట్టుబడిదారీ పత్రికలు పనిపెట్టుకుని దాన్ని పోషిస్తూనే వుంటాయి. చదివే వాళ్ళు చదువుతూనేవుంటారు. కానా ఇవిమాత్రం మూడుపువ్వులూ, ఆరు కాయలుగా వికసిస్తూనేవుంటాయి. పైగా ఏదోకాస్త సైంటిఫిక్ ఫిక్షనని పేరు పెట్టి ఇంతచేస్తుందేసరికి.... ఆ.... ఏమిటీ.... షుగర్‌కోటెడ్ పిల్స్అంటామే అలాగా ఈ విషానికేమోను పైపూతమాత్రం.... ఆ ... చాలా మధురంగా వుంటుంది. ఇది సూదో సైంటిఫిక్ ఫిక్షన్నెప్పి నేనంటాను. అది నిజమైనటు వంటి సైన్సుకాదు. సైన్సుతొడుగుతో మోసంచేస్తున్నటువంటి రచనలు. వాటిని ఎన్నివిధాల ఖండిచాలో అన్నివిధాల ఖండిస్తూనేఉంటాం. కానీ అది అలా కాకూడదూ అంటే అసలు ఈవ్యవస్థ మారితేనేతప్ప అలా వస్తూనే వుంటాయి. అంటే మళ్ళీ మొదటికేవస్తాం. కాబట్టి ఈ వ్యవస్థని నిర్మూలం చెయ్యవలసిన అవసరం మనకుంది, అప్పుడు ఈ వ్యవస్థతోపాటు ఇటువంటి రచనలుకూడా పోతాయి.

ప్రశ్న 6: ఇప్పుడు ఈ 'చేతబడిసాహిత్యం తెలుగు సాహిత్యంలో ఒక trend సృష్టిం చిందనే అభిప్రాయానికి మీరు రాగలుగుతున్నారా?

శ్రీశ్రీ: ఏమీలేదు. కొన్ని మాసపత్రికలుగానీ. వారపత్రికలుగానీ సీరియల్స్ వేస్తుంటే ఒక ప్రత్యేక పంవిధానం- ఇదిచేసి- ఒక సాహిత్యప్రక్రియగా దాన్ని చూడ

సక్కరలేదు. మనకికొత్తగానీ పాశ్చాత్య సాహిత్యంలో సెక్సైతేనేమిటి, డిటెక్టివ్ సాహిత్యమైతేనేమిటి, మళ్ళీ లేటెస్టుగా ఎక్సార్సిస్టనీ ఇటువంటివి ఎన్నో వస్తూనేవున్నాయి. పైగా అవి బెస్ట్‌సెల్లర్స్- లక్షలసంఖ్యలో అమ్మకం కావడం చూస్తున్నాము. దాన్ని దిగుమతిచేయడానికి ఇప్పుడు ప్రయత్నం జరుగుతున్నది.

ప్రశ్న 7: ఈమధ్య జ్వాలాముఖి ఓచోట ప్రసంగిస్తూ "విప్లవసాహిత్యాన్ని గద్దర్, శ్రీశ్రీ, రావిశాస్త్రి బూతుమయం చేస్తున్నారు" అన్నారు దానిమీద మీ అభిప్రాయం చెప్పండి.

శ్రీశ్రీ: భాషదృష్ట్యా బూతుమయంచేశామా? వస్తుదృష్ట్యా బూతుమయం చేశామా? రావిశాస్త్రీ బూతుమయంచేసి నేనూబూతుమయంచేసి.... ఇంతచేస్తే జ్వాలాముఖి విమర్శనునేను Legitimate విమర్శగా తీసుకోను.

ప్రశ్న 8: వ్యవస్థలో మార్పుకోసం మీరు 'మహాప్రస్థానం' రాశారుగదా ! ఆ విప్లవం తేగలిగిన ప్రజలకి అందుబాటులోలేకుండా మనరాష్ట్రంలోనైతే ఏడున్నర రూపాయలు ఉందిదానిధర. విదేశాల్లోనైతే ఏడొందలయాభైకి కొనెట్టూ అదీ ఇస్తున్నారు. మరి గ్రంథకర్తగా మీరు దీనికి ఎలా అనుమతించారని సందేహం.

శ్రీశ్రీ: అంటే దాన్ని బైబిలు ప్రచారసమితివాళ్ళు ఉచితంగా పంపిణీచేసినట్టు చేయాలని మీ వుద్దేశమేమో నాకుతెలియదు.

ప్రశ్న 9: మా ఉద్దేశం అదికాదు. విప్లవసాహిత్యగ్రంథాన్ని బూర్జువా సమాజంలో ఒక కమాడిటీగా చేశాంగదా....

శ్రీశ్రీ: వచ్చినచిక్కల్లా ఏమిటీఅంటే పుస్తకంఅచ్చువేసి అమ్మడం వ్యవస్థేకానీ ఇది సామ్యవాద వ్యవస్థకాదు. చార్లీ చాప్లిన్ పిక్చరుకేమో పది రూపాయలు టిక్కెట్టెందుకు పెట్టారు అనడిగితే ప్రయోజనంలేదు. ఇవన్నీకూడాను ఇప్పుడు నేనుచెప్పినట్టు ఈ వ్యవస్థలో మామూలుగా జరిగేపనులే.

ప్రశ్న10: మీ పుస్తకాలు మీరే సొంతంగా పబ్లిష్ చేసుకోదలచారని తెలిసింది. దానికి కారణం ఏదైనావుందా?

శ్రీశ్రీ: కారణం మరేమీలేదు. చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారున్నారు, విశ్వనాథ సత్యనారాయణగారున్నారు. ఒక రచయిత తన రచనలమీద బతికే అవకాశం ఇప్పుడు వచ్చింది. పాఠకులకీ, రచయితకీ మధ్య పబ్లిషర్స్- దళారీతనాన్ని పోగొట్ట

డానికి వీలవుతుంది. ఐతే ఒకటి. మళ్ళీ నేనచ్చువేసి మళ్ళీ ఎవరికో కమీష నివ్వాలి. ఇది కొంచెం నేను ఆలోచిస్తున్నాను. ఏమిటీ.... ఇదొక్కటేకాదు. గ్రంథరచన- గ్రంథకర్తకీ, పాఠకుడికీ మధ్యన దళారీ. అలాగే ఒక సినిమా గానీతీస్తే- ఎక్స్పెరిమెంట్‌గా తీసేవన్నీ మనవాళ్ళు తీస్తున్నారు. తీస్తున్న డిస్ట్రిబ్యూషన్ కొచ్చేసరికి మళ్ళీవీళ్ళే. కమీషన్లు కొట్టేసేవాళ్ళూవీళ్ళే- ఇట్లా గాకుండా నేనొక స్కీం అనుకుంటున్నాను. ప్రతీ జిల్లా కేంద్రంలోనూ, శ్రీకాకుళం, విశాఖపట్నం, విజయనగరం, రాజమండ్రి ఇవన్నిట్లో కూడానూ అభిమానసంఘాలు ఉన్నట్టుగా ఫిలిం అభిమానసంఘాలుబయల్దేరి వాళ్ళేమోనూ ఈ ఎక్స్పెరిమెంటల్ సినిమాలు చూడగలిగివుండాలి. మరి వీటిని చూడాలీ అంటే ఎగ్జిబిషన్ కొశ్చన్ వస్తుంది. పెద్దథియేటర్లు ఎవళ్లూ ఇవ్వరు. ఇచ్చినా కూడాను వాళ్ల రెంట్ తగ్గించుకోరు. చాలా తీవ్రమైనటువంటి సమస్య. దీన్ని ఎట్లాగా స్మాష్ చెయ్యాలీఅంటే- దాన్నిగురించే నేను ఆలోచిస్తున్నాను, స్మాష్ చెయ్యడానికి ఈ ఆర్థికవ్యవస్థ మీద ఎటాక్‌చెయ్యాలి.

ప్రశ్న 11 : మన దేశంలో, ముఖ్యంగా తెలుగు దేశంలో (విప్లవ) రచయిత అన్న వాడు రచనను వృత్తిగాచేపట్టి జీవించేస్థితి వచ్చిందంటారా ?

శ్రీశ్రీ : ఇప్పటికీగూడా డాక్టరుపనిచేస్తూనో, బ్యాంకు ఉద్యోగిపనిచేస్తూనో, ప్లీడర్‌గా ఉంటూనో రాయడమేతప్ప రచయితకి రచయితగా తన కాళ్ళమీదతను నిలబడ గలిగే పరిస్థితులు లేవు. కానీ ఈవిధానం పరిమితుల్లోనే ఒక రచయిత రచ యితగా జీవించడానికి అవకాశంవుందీ అనుకుంటున్నాను. ఇప్పుడు జర్న లిస్టు జీవించడంలేదూ ? వాడూ రచయితేకదా. అందులో మళ్ళీ బూర్జువా జర్న లిస్టూ ఉన్నాడు. విప్లవ పాత్రికేయుడూ వున్నాడు. ఈ విప్లవ పాత్రికేయు డేమో విధిగా బాధలుపడక తప్పదు. ఈ వ్యత్యాసం ఉంది. వ్యత్యాసంలేనటు వంటి సమాజం కోసం మనం పాటుపడాలి

ప్రశ్న 12 : మీరీమధ్య విదేశాలకి వెళ్ళినప్పుడు మన తెలుగు దేశంలో జరుగుతున్న విప్లవ సాహిత్యోద్యమాన్ని గూర్చి చెప్పడానికి అక్కడి వేదికల్ని ఏమైనా ఉపయోగించుకున్నారా ?

శ్రీశ్రీ : అమెరికాలో నేనున్న ఏడువారాల్లో ముఖ్యంగా చేసిందే ఇది. అమెరికాలో కొన్ని డజన్ల విశ్వవిద్యాలయాలున్నాయి. అన్నిట్లోనూ మాట్లాడడం అసంభవం. నేను కనీసం ఒక అరడజను విశ్వవిద్యాలయాల్లోనైనా మాట్లాడివుంటాను మన

సాహిత్యం ఏరూపం ఈనాడు ధరిస్తున్నదో చెప్పాను. అవన్నీ టేప్ కూడాచేసి వున్నాయి. ఎప్పుడన్నా పబ్లిష్ చేస్తానుకూడాను.

ప్రశ్న 13 ; కొ. కు. గారూ, మీరూ మద్రాసులోనే వున్నారు. ఆయన సినిమారంగంలోకి వెళ్ళలేదు. కానీ మీరు ఎట్లాచిక్కుకున్నారు ?

శ్రీశ్రీ : కుటుంబరావుగారుకూడా సినిమా రచనచేశారు. కథలూ రాశారు, డైలాగులు రాశారు. ఐనా ఆయనకి సుస్థిరమైన చందమామ ఉద్యోగం దొరికింది. ఆ కారణంగా ఈ సినిమా 'గబ్బు'లోంచి ఆయన బైటపడిపోయాడు. నేనేమో ఒక విధమైన జీవితావసరంవల్ల అక్కడేవుండిపోయాను. సినిమా As it is దాన్ని గర్హించనక్కరలేదు. పెట్టుబడిదారీ చేతుల్లో వుండటంవల్ల వాళ్లు దాన్ని స్వప్రయోజనాలకి ఉపయోగిస్తుండటంవల్ల ప్రజలకు చేదు సరఫరాఅవుతోంది కానీ అదే సినిమాతో ప్రజల జీవిత విధానాన్ని బాగుచేయవచ్చును. కొత్తరకం పిక్చర్లు తీయొచ్చును. ఈనాడు కొన్ని ప్రయత్నాలు జరుగుతూన్నాయి. నేను తొలినుంచీ గమనించాను. ఆరోజుల్లో కొన్ని చాలా ఫెలయ్యాయి. ఈరోజు మంచి సక్సీడ్ అవుతున్నాయి. ఇకమీద ఇంకామంచి పిక్చర్లొస్తాయని చెప్పి నేననుకుంటూఉన్నాను.

ప్రశ్న 14 : అటువంటి చిత్రాల పేర్లేమయినా చెప్పగలరా !

శ్రీశ్రీ : 'మాభూమి' ఒకటుంది. ఊరుమ్మడి బతుకులు, తర్వాత చలిచీమలు. కొన్ని సక్సీడ్ అయ్యాయి కొన్నికాలేదు కానీ trend ఒకటి వచ్చిందికదా !

ప్రశ్న 15 : మీరు గట్టిగా ప్రయత్నిస్తే స్థిరమైన వుద్యోగం ఏదైనా దొరికివుండేది గదా. అలాంటప్పుడు ఆ ప్రయత్నం చేయకుండా సినిమాల్లోనే ఎందుకున్నారు అని కొందరడుగుతున్నారు. మీరేంచెబుతారు ?

శ్రీశ్రీ : నాకప్పుడు ఉక్కిరిబిక్కిరయేంత పనివుండేది. ముఖ్యంగా డబ్బింగ్ చిత్రాలు. అది ఇంకోళ్ళకి సాధ్యంకాదు. ఇంత పనివస్తూవుండగా నాకు ఉద్యోగంకోసం చూసుకోవలసిన అవసరం ఏమిటి ? ఏం లేదు.... ఇప్పుడు నేను బిజినెస్సే పెట్టుకున్నాను. బంగాళాదుంపలవృత్తి పెట్టుకున్నాను. దానిమీద వేలకొద్దీ ఆదాయం వస్తున్నది. నువేమో ఎందుకీ బంగాళాదుంపల వ్యాపారం పెట్టుకున్నావు ? నువు గనక తల్చుకుంటే ఆంధ్రపత్రిక్కో, పత్రికకో ఎడిటర్ అయ్యేవాడివిగాదా ? అవన్నీ Might have beens. ఈ సినిమా నేను కోరు

కున్నదికాదు. అదే విధంగా నేను కోరుకోకుండా బంగాళాదుంపల వ్యాపారం చేసేవాణ్ణనుకోండి. ఈనాడు మీరునన్ను ఆప్రశ్న అడగడానికి వీల్లేదు. నీఅంతవాడు బంగాళాదుంపల వ్యాపారం చేయకుండా ఇంకోటేదో చేయవచ్చును గదా అన్నది ఇర్రెలెవెంట్ ప్రశ్న.

ప్రశ్న 16 : ఇప్పుడు సినిమాల్లో విప్లవం ఫాషన్‌గా కూడా కొన్ని వస్తూవున్నాయి. వాటిమీద మీ అభిప్రాయం ఏమిటి ?

శ్రీశ్రీ : ఇప్పుడు సినిమాయే కాదు.... మన ప్రభుత్వం కూడా, పీల్చిపిండి చేసేటటువంటి ఎక్స్‌ప్లాయిటింగ్ ఏజెన్సీ మన ప్రభుత్వం, అటువంటి ప్రభుత్వం పడగ కిందవుంటూ మనమేమో విప్లవచిత్రాలు తీస్తాంఅంటే మొదటి సంగతి ఎవడూ డబ్బుపెట్టడానికి ముందుకురాడు. డబ్బు పెట్టినాకూడా ఆడబ్బు తిరిగి వస్తుందనే నమ్మకమూలేదు. అందుకోసం కొంచెం ఈ ఫోక్‌లోర్ ట్రెండ్ మొదలుపెట్టాలి. విప్లవం ఫాషనైందని మీరిందాకా అన్నారే దానికోచిన్న ఉదాహరణ చెప్తాను- అప్పట్లో తమిళనాడులో అన్నాదురై, కరుణానిధి, ఎంజిఆర్‌లు చాలా సటిల్‌మెథడ్స్‌లో సినిమాని ఆధారంగా చేసుకుని డిఎంకె ఐడియాలజీని ప్రచారం చేశారు- కేవలం సినిమావల్లనే ఒక 10 సంవత్సరాల్లో కాంగ్రెస్‌ని నిర్మూలనం చెయ్యగలిగారు- ఈనాడు తమిళనాడులో కాంగ్రెస్ అధికారంలోకి వస్తుందని మీరు అనుకోగలరా ? అదిఅట్లా కావడానికి కారణమేమిటి ? డిఎంకె ఐడియాలజీవల్ల వచ్చిందా ? ఏమీ లేదు- సినిమా గ్లామర్- ఎంజిఆర్ ఇమేజ్ సూదోసోషలిజం కావాలు- సోషలిజంగా కనబడతాయి కానీ అది సోషలిజం కాదు- వాళ్ళన్నీ ఫోక్‌లోర్ చిత్రాలే తీశారు. ఒక రాజుగారు, ఆ రాజుగారి దగ్గర పురోహితుడు- పురోహితుడు అంటే ఈనాటి బ్రాహ్మణ్నే వాళ్ల దృష్టిలో పెట్టుకున్నారు- ఆ పురోహితుణ్ని తిడతారు- సెన్సార్ వాళ్ళేమీ చేయలేరు- ఈవిధంగా వాళ్ళు తమ ఐడియాలజీని ప్రచారంచేశారు- సెన్సార్‌షిప్ లిమిటేషన్స్‌ని అధిగమించి వాళ్ళు చేయగలిగారు- ఈనాడు మనం అంతకంటే చేసేదేంలేదు- ఇప్పుడు ఫర్వాలేదుకానీ ఇంతకుముందు నేనేదన్నా పాటలో విప్లవం అన్న మాటవాడితే నిర్మాత భయపడేవాడు- ఇప్పుడు అంజయ్యగారూ విప్లవం అంటారు- సస్యవిప్లవం అంటారు, ఏదో అంటారు- విప్లవం అనేది అర్థంలేనిమాటగాతయారైంది.

ప్రశ్న 17 : ఆకలిరాజ్యం సినిమాలో శ్రీశ్రీ కవిత్వాన్ని భ్రష్టుపట్టించారనీ, సందర్భం నుంచి వేరుచేసి వాడారనీ విమర్శ- దీ తో మీరెంతవరకు ఏకీభవిస్తారు ?

శ్రీశ్రీ: ఆపిక్చరు నేను చూడలేదనుకోండి- చూడకపోయినప్పటికీ బాగా హిట్టయిందని విన్నాను- అది హిట్టయిందంటే అర్థం ఏమన్నమాట? దానికి ఒక విధమైన అనుకూలమైన రిసెప్షన్ వచ్చింది- people have recieved it bavourably ఐతే ఐడియాలాజికల్‌గా ఎందుకని తీయలేదు అంటే మన ఐడియాలజీ ఉన్న వాళ్ళు దేశంమొత్తంమీద 10% కంటె ఎక్కువఉండరు. ఈ ఐడియాలజీని ప్రచారం చేసుకోవడానికి ఇతరసాధనాలు వాడుకోవాలిగాని సినిమా ఎవరి చేతుల్లో వుండకూడదో వారిచేతుల్లోవున్నది. కాబట్టి ఈనాటికీ వాళ్ళు దేవతా కల్యాణమనీ, అయ్యప్పమహిమనీ తీస్తూనేవున్నారు, చూస్తూనేవున్నాను- వీటిని మనంఅడ్డలేం. కాబట్టి మనకికావల్సిందేమిటంటే ఈ వ్యవస్థనిమార్చడం కేరళలో Co-operative పుస్తకసంస్థలున్నాయి. అలాగే అందరూ చందాలు వేసుకొని సినిమాల తీయడం- ఇవన్నీ జరిగేపనులుకావు. అన్నిటికంటే చాలా గుదిబండలాగ ఈవ్యవస్థ మననెత్తిమీద కూచునివుంది. ఎప్పటికప్పుడు కాంప్రమైజ్ చేసుకోకతప్పదు. ఈ ఎర్రమల్లెలు- ఇవన్నీ ఫోక్‌లోర్‌సినిమా. రేపొద్దుట మహాప్రస్థానంఅని ఓసినిమాతీస్తానన్నాడు. నేను అంగీకరించాను. అందులో రిక్షావాడేమో పెద్దింటిఅమ్మాయిని.... పాతాళభైరవి సినిమాలో తోట రాముడు రాజుగారమ్మాయిని పెళ్ళిచేసుకున్నాడు. ఇది ఫోక్‌లోర్ ఐడియా. అక్కడ తోటరాముడేమో ఇక్కడ రిక్షావాడయ్యాక. అంతకంటె ఏంలేదు.

ప్రశ్న 18 : పోతన 500వ జయంతిని ప్రభుత్వం చాలా అట్టహాసంగా జరుపుతోంది. ఆయన ఆశయాలకు విరుద్ధంగా ప్రభుత్వంజరిపే ఈ ఉత్సవాన్ని మీరు ఎలా భావిస్తున్నారు?

శ్రీశ్రీ : ఇదికూడా ఒకవిధమైన ప్రపంచ తెలుగు మహాసభల్లాంటిదే వాళ్ళపబ్బం గడుపుకోడానికి మేం పేదవాళ్ళకి ప్రాతినిధ్యం వహిస్తున్నాం అంటూ ఏదో పాతకవిని తీసుకొచ్చి glorify చేయడంవల్ల వాళ్ళ పబ్బంగడుస్తుందేతప్ప అసలు పేదవాళ్ళ కొరిగేదేమీలేదు. ఏవో పెద్దవాళ్ళింట్లో పెళ్ళిజరుగుతోంది. వాళ్ళఇష్టంవచ్చినంత ఖర్చుపెడతారు. ఏంచేత? వాళ్ళదగ్గర డబ్బువుందికాబట్టి ఖర్చుపెడుతున్నారు. దాన్నిమనం condemn చేస్తాం. ఇదిగో ఇదిపద్ధతికాదు- రేపు వాళ్లు పేదలగురించి ఏదైనా ఆర్భాటంచేస్తారు- వద్దని అనలేంకదా.

ప్రశ్న 19 : చెయ్యొద్దని అనడంకాదుగానీ పోతన ఆశయాలు వేరుగాఉన్నాయి. తాను రాసిన కావ్యాల్ని వారికి అంకితంఇవ్వననాడు. మీ[illegible]

అటువంటి పోతన 500వ జయంతిని ఇవాళ ఇన్నిలక్షలఖర్చుతో జరుపుతూ వుండే ఒక రచయితగా మీరు దానిపట్ల ఏవిధంగా రియాక్టవుతున్నారు ?

శ్రీశ్రీ : దానికేదైనా Press statement ఇచ్చి condemn చేశాననుకోండి నాకు ఇష్టంలేదు నిజంగా. ఇష్టంలేదని చెప్పానునేను. నేను చెప్పినంతమాత్రాన వాళ్ళు మానేస్తారా ?

ప్రశ్న 20 : మీరీమధ్య కామన్‌వెల్త్‌లో ఉండటం భారతదేశానికి గర్వకారణం అన్నట్టు పత్రికాప్రకటన వచ్చింది. ఇదివరకోసారి కామన్‌వెల్త్‌లో ఉండటమే భారతదేశానికి స్వాతంత్ర్యం రాలేదనడానికి నిదర్శనం అన్నారు. దీన్నిబట్టి మొహమాటానికి మీరామాట అనట్టా లేక....

శ్రీశ్రీ : ఏదో కామన్‌వెల్త్ సభ జరిగినప్పుడు ఇందులో మేంగూడ సభ్యులమేను అన్నానుగానీ, అక్కడ ఈ కామన్‌వెల్త్ నాశనంకావాలి, విప్లవం వర్ధిల్లాలి అని నన్ను అనమన్నారా ? కామన్వెల్త్ సభకి నన్నుపిలిచారండీ! అసలు వెళ్ళ కూడదు న్యాయంగా. కాని వెళ్ళింతర్వాత వాళ్ళనెందుకు అక్కడ condemn చేయడం ?

ప్రశ్న 21 : అఖిలభారత స్థాయిలో విప్లవ రచయితలసంఘాన్ని ఏర్పాటుచేయడానికి మీలాంటివారు కృషిచేయవచ్చుగదా ? మీరెందుకు ఆ చొరవతీసుకోరు ?

శ్రీశ్రీ: శారీరకంగా కదిలేస్థితిలోలేను- స్థిరంగాకూచుని చెయ్యవలసిందేనేను. ఆల్ ఇండియా స్కేల్లో విప్లవరచయితలసంఘం ఏర్పడ్డం అభిలషణీయం.

ప్రశ్న22 : విప్లవసాహిత్యం ఏభాషలో ఎక్కువగా వస్తోందని మీరు భావిస్తున్నారు ?

శ్రీశ్రీ : ఈవిషయంలో అగ్రేసరంగాఉన్నది తెలుగుసాహిత్యమే. మిగతాభాషల్లో కూడా ఇది మొదలవుతున్నది. ఇతర భాషల్లోంచి సూటిగా తెలుగులోకి తర్జుమాలురావాలి. ఇందాక మీరుచెప్పినట్టుగా మరాఠీలో నైతేనేమి, బెంగాలీలో నైతేనేమి, పంజాబీలో నైతేనేమి విప్లవకవిత్వం వస్తోంది- వీటన్నిటినీ ఒక వేదికమీదికితెచ్చే ప్రయత్నం జరిగితే బాగుంటుంది.

ప్రశ్న 23 : ఒక డీలాన్‌థామస్, ఒక మెర్లిన్‌మన్రో ఆత్మహత్య చేసుకునేస్వేచ్ఛ అమెరికన్ ప్రజాస్వామ్యంలోవుందని మీరు అన్నారు- ఇప్పుడుమీరు వెళ్ళి వచ్చారుగదా, ఇంకా అలాటిస్వేచ్ఛవుందా ?

శ్రీశ్రీ : డీలాన్ థామస్ ఆత్మహత్య చేసుకోలేదే- అలానేనుఅనివుండనే. ఇప్పటికీ అమెరికాలో తండ్రికొడుకునీ, కొడుకుతండ్రినీ చంపేస్వేచ్ఛవుంది. ఆయుధాలే మోను పకోడీల పొట్లంకొనుక్కున్నట్లు కొనుక్కోవచ్చు.

ప్రశ్న 24: దాన్ని స్వేచ్ఛఅంటారా ?

శ్రీశ్రీ : స్వేచ్ఛనివాళ్ల అలా నిర్వచించారు. అలా వాళ్ల తయారయ్యారు. అమెరికా ప్రజల్లోకూడా అసంతృప్తివుంది. డబ్బుతో పులిసిపోయిన సమాజం కాబట్టి వాళ్లచేతుల్లోంచి సామాన్య ప్రజలు బయటపడలేక పోతున్నారుగానీ విప్లవం అనేది అమెరికాలోగూడా వస్తుందని నా నమ్మకం.

ప్రశ్న 25: మలేషియా తెలుగుసభలకి వెళ్ళడానికి నిరాకరించినమీరు చికాగో తెలుగు సభలకి ఎలావెళ్ళారు ?

శ్రీశ్రీ: మన ప్రభుత్వం పంపలేదే. వాళ్ళు ఇన్‌వైట్‌చేశారు. మన ప్రభుత్వానికీ దానికీ ఏం సంబంధంలేదు.

ప్రశ్న 26: తెలుగుదేశంలో ఎన్నో పోరాటాలు జరుగుతున్నాయి. కవిగామీరు వీటికి ఎందుకు స్పందించడంలేదు ?

శ్రీశ్రీ: ఒకటి- తెలుగుదేశానికి కొంచెం దూరంగా వుండటంవల్ల. అందుకోసమే వీలైనంతత్వరలో నేను పుట్టిన స్వస్థలానికి- విశాఖపట్నానికి- వచ్చి settle down ఐ పోవాలనుకుంటున్నాను. ఇంకాకొన్ని practical difficulties ఉన్నాయి. ఇప్పుడు మద్రాసులోవుండి తెలుగుపేపరు చూడ్డంకూడా కుదరడం లేదు. విశాలాంధ్రమాత్రం Free గా వస్తుంది. అందువల్ల ఇప్పుడు ఏమిటి జరుగుతున్నదోకూడా నాకుతెలీదు. ఒకవిధంగా నేను sealed off. కాబట్టి రియాక్ట్ కావల్సినంతగా నేను రియాక్ట్ కాలేకపోతున్నాను. slowly Iam retiring. వీలైనంతవరకు ప్రశాంతమైన జీవితంకోసమన్జెప్పి మొట్టమొదటిసంగతి I must be careful about my health. ఇది వరకు 10 మైళ్ళు నడిచేవాణ్ని ఇప్పుడు మెట్లుదిగితేనే ఆయాసంవస్తోంది. ఆ భేదం వుంటున్నదిగదా ఒక్కొక్క దశాబ్దం గడుస్తున్నకొద్దీ.

నేను ఏవోకొన్ని సాహిత్యపరమైన రచనలు చెయ్యాలని నా మనసులోవున్న దానికి కొన్ని పరిస్థితులుకూడానేను క్లియర్ చేసుకోవాలిగదా ! ఇదివర పరిగెత్తుతూనో, గెంతుతూనో ఏదోరాశాను- ఇప్పుడలాంటిస్థితిలోలేను- ఏ

స్థిమితం ఏర్పడాలి- అదేర్పడితే సాహిత్యానికే ఎక్కువ నాజీవితాన్ని వినియోగించాలనివుంది- I will be an active creative writer. అది వదిలి పెట్టను.

ప్రశ్న 27: మద్రాసులో ఈమధ్య జ. నా. మం. కార్యక్రమాలు జరిగాయి- వాటిమీద మీ అభిప్రాయం ఏమిటి ? జనం రియాక్షన్ ఎలావుంది ?

శ్రీశ్రీ: జనంలో వాళ్ళు మంచి సంచలనం కల్గించారు- కల్గించారుగానీ మద్రాసువంటి మహానగరాల్లో ముందుగా కావల్సిందేమిటంటే పబ్లిసిటీ- అది లేకపోవడంవల్ల అక్కడికి వచ్చినవాళ్ళు మన ఐడియాలజీకి దగ్గరివాళ్ళే- వాళ్లే తప్ప General public చాలా తక్కువ మంది వచ్చారు- దానికి మన పద్ధతులు ఏమన్నా మార్చాల్సివుంటుందో ఏమిటో- ఎక్కువ మందిని ఆకర్షించి టిక్కెట్లు కూడా పెట్టాలి లేకపోతే ఫ్రీపెర్ఫార్మెన్స్ ఇస్తే వచ్చే వాళ్ళందరూ వీళ్లేవస్తారు- కమర్షియలైజ్ చెయ్యడమన్నా అనండి నాకేం అభ్యంతరం లేదు- మొన్న నాతో అన్నారు- తమిళనాడు ఇంటీరియర్‌కి కూడా వెళ్తాం అని- కానీ కనీసం ఖర్చులన్నా గిట్టుబాటుకావాలి కదా ! దానికేమో మనం కమర్షియల్ పద్ధతులు అవలంబించాలిగదా- ఈ పబ్లిసిటీ విధానాల్ని అనుసరించి టికెట్లుపెడితే.... ఒక కుర్రాడంటాడు.... ఏమిటిరాఇదీ ఈ జననాట్యమండలి కూడాను కమర్షియలైజ్ ఐపోయిందన్జెప్పేసి- ఈనాడు మనం ఏవ్యవస్థలోవున్నాం ? ఆవ్యవస్థలో వుండి దాన్ని డిస్‌క్రెడిట్ చెయ్యాలి.

ప్రశ్న 28: మనం కమర్షియులైజ్ చేసింతర్వాత ఈ వ్యవస్థలోవున్న చెడుని ఎలా డిస్‌క్రెడిట్ చేస్తాం ?

శ్రీశ్రీ: ఈ వ్యవస్థలోఉన్న చెడుని అంతా తూర్పారపడతాం- ఆతూర్పారపట్టిందాన్నేమో మళ్ళీ వాళ్ళకే అమ్ముతాం- అయ్యయ్యో ఇది పాపపుసొమ్ము దీన్ని తీసుకోకూడదు అనుకోకూడదంటాను.

ప్రశ్న 29: ఇటీవల మీరు గ్వాటిమాలా విప్లవ కవి ఒతో - రెని - కస్తియ్యో కవితను అనువదించారు- అది రాజకీయాలకు దూరంగా మడిగట్టుక్కూచున్న మేధావులకి హెచ్చరిక. మరి దీన్ని అనువదించిన మీకు ఆ కవిత ఆత్మవిమర్శకు అవకాశం కల్పించలేదా ?

శ్రీశ్రీ : అటువంటి మేధావివర్గానికి చెందినవాడుగా నన్ను నేను భావించడంలేదు. ఎందుకంటే అలాభావిస్తే మహాప్రస్థానం, మరోప్రస్థానంలాంటివి రాయవల్సిన పన్లేదుగదా !

ప్రశ్న 30 : 30 ఏళ్ళుగా మీకవిత్వంలో మీరుచెప్తున్న విషయాలు తెలుగు ప్రజలు సీరియస్‌గా పట్టించుకుంటున్నారు. మరిమీరు వాటినెప్పుడు పట్టించుకుంటారు?

శ్రీశ్రీ : నేను చెప్పినవాటికి నేనెప్పుడూ కట్టుబడేవుంటానుగదా ! సాహిత్యానికి సంబంధించినంతవరకు నన్నెవరైనా రియాక్షనరీ అంటారా ? అంటేఏమిటీ నేను చెప్పేదొకటీ చేసేదొకటి కావాలి.

ప్రశ్న 31: ఇతరులు మీలో విభిన్నవ్యక్తిత్వాలు చూస్తున్నారు. మహాప్రస్థానం శ్రీశ్రీ పేరులనీ, గుంటూరు శేషేంద్రశర్మకి కితాబులిచ్చే శ్రీశ్రీ వేరనీ, వ్యక్తిగతంగా శ్రీరంగం శ్రీనివాసరావువేరనీ అంటున్నారు- ఇటీవల ఒక పత్రికలో ఇలాంటి ఇంటర్వ్యూకూడా వచ్చింది- దీనికి మీరేమంటారు ?

శ్రీశ్రీ : అదికూడా ఒకవిధమైన జర్నలిస్టిక్ స్టంటే. సర్క్యులేషన్ పెంచుకోడానికి- ఇదికూడా ఫోక్‌లోర్ ఐడియా- కన్యాశుల్కంలో బైరాగిగూర్చి ప్రచారం జరుగుతుంది- ఈయనేనాృ ఉప్పాడలోనూ, సింహాచలంలోనూ ఒకేరోజు కన్పించాడని- అదెలాసాధ్యంఅనేంలేదు- అతనిభక్తులు అలాప్రచారం చేస్తారు

ప్రశ్న 32: మీగూర్చి అలాఅంటున్నవాళ్ళు ఎవరిభక్తులంటారు ?

శ్రీశ్రీ : నాభక్తులే.

ప్రశ్న 33: శ్రీశ్రీ తాగగాలేనిది నేనుతాగితే తప్పేమిటిఅనే యువకవికి మీరుఇచ్చే సంజాయిషీ ఏమిటి ?

శ్రీశ్రీ : శ్రీశ్రీరాయగాలేనిది నేనురాస్తే తప్పేమిటిఅనిగూడా ప్రశ్నించుకోమంటాను.

ప్రశ్న 34: ప్రశ్నకి ప్రశ్న జవాబుకాదు దానికేమంటారు ?

శ్రీశ్రీ : రచనలమీద శ్రద్ధచూపించమంటాను- నేనిప్పుడు స్మోకింగూ, డ్రింకింగూ మానేశాను మీకుతెల్సా ? అమెరికా వెళ్ళివచ్చిందగ్గర్నించీ ఇక్కడ (గొంతులో) ఏదో నొప్పిగావుండేది. సరే నెగ్లెక్ట్‌చేశాను. కిందటిసారి 'ఊస్ పెన్స్‌పైమ్స్' పుస్తకం ఆవిష్కరణకు ఇక్కడికి వచ్చివెళ్ళింతర్వాత డాక్టర్‌కి చూపించాను. ఆయన పెద్దఎక్స్‌పర్ట్- ఆయన ఒక్కరోజు ఆలస్యంగావస్తే కృష్ణశాస్త్రిగారి

లాగా అయిపోయివుండేవాడివి అన్నాడు. ఐతే ట్రీట్‌మెంట్‌కిముందు ఆరెండూ మానేస్తేనేగాని ట్రీట్‌మెంట్ ఇస్తానన్నాడు. అప్పణ్నించీమానేశాను.

ప్రశ్న 35: వేగుంట మోహనప్రసాద్ 'దిస్ ఎన్‌ప్రైమ్స్' ప్రచురించడంలో ఆయన ఎన్నుకున్నకాలం, అదంతా సబబేనంటారా ?

శ్రీశ్రీ: మనం మనప్రమాణాలతో అతన్నెలా కొలుస్తాం ? మొత్తంమీద ఏమున్నా లేకున్నా అందర్నీ ఒకచోటికి తీసుకువచ్చే ప్రయత్నంచేశాడు. అన్నీ Tolerable translations. బాగులేవని అనడానికి వీల్లేదు, ఇంకాబాగుండే అవకాశంవుండొచ్చు. అదివేరేసంగతి. ఒక Anthology గా Compose చేయడం చాలా గొప్ప సంగతి కదా। To that extent let us congratu-late him. అదీ నేననేది.

ప్రశ్న 36: అంజయ్యగారిదే అసలైన తెలుగు అని ఆస్థానకవి దాశరథి అన్నాడు. దానిమీద మీ అభిప్రాయం ఏమిటి ।

శ్రీశ్రీ: అంజయ్యగారి తెలుగు నేనెప్పుడూ వినలేదు. దాశరథిగారి తెలుగు విన్నాను. అంజయ్యగారిది అసలు తెలుగైతే దాశరథిగారిది కాదేమో అని అనుమానించ వలసి వస్తుంది.

ప్రశ్న 37: అంజయ్యగారు భువన విజయం లాంటిది ఏర్పాటుచేసి దిగ్గజాల్ని పెడు తున్నాడు దాన్లోమీకేమైనా ఆఫరొస్తే ఏం చేస్తారు ?

శ్రీశ్రీ: ఫ్లాట్‌గా రిఫ్యూజ్ చేస్తాను

ప్రశ్న 38: ఇటీవలి కాలంలో మీరు చదివిన ఒక మంచిరచన. దానిమీద మీ అభిప్రా-యం చెప్పండి.

శ్రీశ్రీ: ఈమధ్య ఏంచదవడంలేదు. ఎంచేతంటే ఐసైట్ కూడా తగ్గిపోతోంది. ఇంకో పనిచేయాలి. ఐసైట్‌కి కాటరాక్ట్ ఆపరేషన్ చేయించుకోవాలి. తర్వాత గ్లాసెస్ వాడాలి. మీ మొహాలు కూడా నాకు సరిగా కన్పడడం లేదు.

ప్రశ్న 39: మీ జీవితంలో ఏ సంవత్సరాన్ని గొప్ప సంవత్సరంగా భావిస్తారు ? అలాంటి సంవత్సరం ఏదన్నావుందా ?

శ్రీశ్రీ: నాషష్టిపూర్తి సంవత్సరం 1970. ఆ సంవత్సరం విరసం పుట్టింది. ఆ సంవత్సరాన్ని నాజీవితం అంతట్లోకీ ముఖ్యమైన సంవత్సరంగా భావిస్తాను.

ప్రశ్న 40: తుంగతుర్తి లాంటి గ్రామాల్లో మీరు మైళ్లకు మైళ్లనడిచి పౌరహక్కుల సంఘంవారి సభల్లో పాల్గొన్నారు. ఆ సంఘటన అక్కడిప్రజలు ఇప్పటికీ చాలాగొప్పగా చెప్పుకుంటారు. దాన్ని మీరెలా ఫీలవుతున్నారు?

శ్రీశ్రీ: అందువల్లనే నాకొకవిధమైన ఇన్స్పిరేషన్ వచ్చిందికదా. నేను వెనకపడిపోతున్నాననే ఫీలింగ్‌పోయి keeping pace with the times అనేధైర్యం కలిగించింది ఆ పర్యటన.

ప్రశ్న 41: keeping pace with the times అన్నారుగదా మీ షష్టిపూర్తి సంవత్సరంలో పుట్టిన విరసంతో అంతఆక్టివ్‌గా మీరు వస్తున్నారా?

శ్రీశ్రీ: Active గా రావడానికి one single drawback is my age మానసికంగా చలించటమనేది ఉండదు. శారీరకంగా రాగలనాలేదా అనేది నా ప్రస్తుత ఆరోగ్యానికి సంబంధించినది.

ప్రశ్న 42: ఇంతసేపూ మిమ్మల్ని మేంప్రశ్నలడిగాం. చివరిగా మీరు మమ్మల్నేమయినా ఒక ప్రశ్నఅడగండి.

శ్రీశ్రీ: ప్రశ్నగాఅడగనుగానీ సలహాగాచెప్పేదేమిటంటే మీరు ఏ walk of life లో ఉన్నాగూడా విరసం ఉద్యమానికి తోడ్పడేవిధంగామాత్రం సంచరిస్తూవుండండి.

(ఈ అవకాశంకల్పించిన విరసంకు, సహకరించిన కొందరు విరసం సభ్యులకు కృతజ్ఞతలు.)

---

## సృజన దగ్గర కొత్త పుస్తకాలు

కథలు :

# గొల్లకథ

కె. రాంమోహన్‌రాజు

అయ్యా, గొల్లోనుండ్రి బాంచెను, నా పేరు బుచ్చయ్యగని నన్నంత బుచ్చిగాడంటరుండ్రి. నేను గిప్పుడు కష్టెపుతనయ్య.

పోయిన వైశాకమాసంకెల్లే నాయాల్దానికి పెయిబాగులేకుంట ఉండుకచ్చింది.

జెష్టమాసంవరకు దానికి రోగం పెర్గిపోయింది. ఇగ మాఊర్లె రంగాశార్లదగ్గెర వైద్దంజేయించిన. ఓ, ఒగ కత గాదయ్య కడుపులనొప్పని సుడిబెట్టుకబోయేది. గప్పుడు రంగాశార్లు రసాలుపోశిండు. అకుల్నూరి పట్టీలేశిండు. ఉప్పుబుక్కిచ్చిండు. గిన్నె రొన్నెల్లు వైద్దంజేశిండు- ఈసమెత్తు రోగంగూడబోలే. గప్పుడు నేనే పెద్దేవరకు కొలుపుజేయిచ్చిన. నాదగ్గెరున్న దాంట్లకెల్లి పెద్దపొడేల్ను బలిచ్చిన. ఉం....ఉం.... రోగందిగ్గలే. గా పొడేల్ను కటికోడు మున్నూరుకడుగులెగూడ ఇయ్యలే. గిప్పుడు నా పెండ్లం పానంమీదికచ్చిందని బలిచ్చిన. దానిపానంపోయిందిగని దీనిపానంబాగ్గాలే. పెద్దేవర పొడేల్నుమింగి విమ్మలంగకూసున్నది. గదానిమాంసం మా సుట్టాలంత లొట్టలుగొట్టుకుంట తిన్నరు. తుత్తెల దాక కల్దాగి ఎగిరుండ్రు- "సీయక్క బుచ్చన్నో జోర్‌దార్‌గున్నదే శియ్యకూర" అన్నరు. నేను, నాయాల్దిమాత్రం గత్నె ఇశారంగ కూసున్నం- రొందోర్రోజులుండి సుట్టపక్కలంత పోయినంక కొమటోడు "దుకాండ్ల పద్దు ఎక్కువైందిరో వారీ!" అనుకుంట బాకికిందికి, గొర్రెపిల్లను దోల్కపోయిండు- సొమ్ముబాయె శనిజుట్కునె అన్నట్టయింది నాపని.

గిన్నిజేశినాగూడ నా పెండ్లంమాత్రం నొప్పితోటి బాదపడుతనే ఉన్నది "వాయ్యో వామ్మో ఇగనేంజత్త"అని ఒర్రుతనే ఉన్నది. నాకు ఎటుసమజ్‌గాలే- దాని బాద జూత్తాంటె నాకు తిక్కతిక్కగున్నది- "నీయక్క పెండ్లాంపానం నయంజేయించని గొల్లోడెందుకుర ఉండి?" అనుకున్న- ఎడమశెయ్యెత్తి బుర్రిమీసాలు బిరబిర వడిబెట్టిన- కనిగంతల్నే మల్ల కాల్జచ్చినట్టయి కూసున్న- దాన్ని దావుకానకు తీస్కపోవాల్నంటె ఎన్నిపైసలుగావాల్నో దెల్వలే- ఎన్నైతేందిగని కా వా లె గ ద- మరెక్కన్నుంచత్తయి? నాగ్గిన్నన్ని గొర్లున్నయిగద- గవన్ని అమ్ముకోనైనసరే పోదమనుకున్న- మరి గాయింత అమ్ముకబొయ్యితె తర్వాతబతుకుడెట్ల? ఇగ గదంత తర్వాత, ఆపతికాలంల ఆలోచనశేస్కుంట కూసుంటె అంతఅయిపోద్ది- నేను గిట్ల ఆలోశిచ్చుకుంటాంటె రంగాశార్లచ్చిండు.

"అయ్యవారూ, రోగంతీరు రోగందేనాయె మీ మందు తొవ్వమందుదేనాయె ఏమన్న ఫాయిదవున్నదా చెప్పుండ్లి"అన్న. గప్పుడా అయ్యోరోడు నక్కోలె ఇగిలిచ్చిండు- "అరే ఓర్వారీ! రోగంగాని ఏదిగాని ఎప్పుడుతగ్గాల్నో అప్పుడు పోద్దిగని నేను పొమ్మంటె పోద్దారా?" అన్నడు- గిదెక్కడికతరో! "మరింగ నీ మందులెందుకు బాంచెను" అన్న నేను.

"మానవ ప్రియత్నంరా పిచ్చిముండకొడుక! మనపని మనం జేస్తాంటె దాని కాలానికదిపోద్ది" అన్నడు వాడు- నాకు శిర్రెత్తింది- నీయక్క సకలావస్తలు జుట్టుకోని నేను బాదలుపడ్తాంటె బాపనోడు దర్మశాత్రాలు జెప్పుతుంట జేరిండు అనుకున్న.

"అయ్య, మరి పెద్దావుకానకు తీస్కపోనా?" అనడిగిన- "అఁ" అని ఇచ్చెంత్రి పడి మొకం శిట శిట లాడిచ్చిండు రంగశార్లు- "అరేయ్ ఎర్రిగొల్లోడ! నాకు ఆంజనేయస్వామిసిద్ది ఉన్నదని తెల్వదారనీకు! రోగం నిముశంల బోడగొడ్తుగని ఇది నిక్కంగ రోగంగాదురా కొంత పాపపలం ఉన్నది- అది అనుబవించనిదే శమనం గాదురా" అన్నడు. నొప్పచ్చి మిడుకుతాంటె పాపం అంటదేందిరో వీడో! నీయక్క వీన్తోటేందగని "దావుకానకు తీస్కపోతనుండ్లి"అన్న గట్టిగనే- రంగశార్లు ఒగమానంగ నా మొకంజూశి "సరెబిడ్డ; గన్ని పైసలు నీకాడవున్నప్పుడు నేనేమంట. కొత్తలు ముల ముల బెడ్తానయినీకు" అన్నడు- "అగ్గొ గాపైసలే లెవ్వండ్లి! పైసలుండికాదు- పానం కోసం ఇశారం" అన్న నేను. "ఏందిరో పిచ్చిగిట్ల లేశినాదిర! కొత్తకాని గూడ లేదంటవు, దావుకానకేస్క పోతనంటవు ఏందిర నీకత?" అని మల్లఅన్నడు "ఏమన్న అమ్ముతావుర పైసలకోసం?"

"తప్పుతాది బాంచెను, మీఅసొంటి పెద్దల దయుంటె" అన్న నేను- గీమాటల ఏమున్నదో నాకర్దంగాలేగని అయ్యోరోనికి కోపమచ్చింది అరుగుమీంచిలేశి ముడ్డి దులుపుకుంట సక్కగబొయిండు- నేను గక్కన్నే పోటుగర్రకు అనుకోనికూసున్న "ఎట్లనన్నా! ఏదన్న అమ్మదామంటె ఎండిబంగారాలు అయిపాయె- ఇన్నాల్లు పాన మోలెసాదిన గొర్రెజీవాల్దప్ప ఇంకేంలెవ్వు! ఇప్పుడు పుసుక్కున అమ్మదామంటె పానందరిత్త లేదు- అపుసరాని కమ్మతె అడ్డికి పావుశేరుఅడుగుతరు- గాతర్వాత అడుక్క తినాలె- ఇంగెట్లజేద్దురా నారాయినా బగమంతుడా" అని ఇశారంజేస్తుండంగ నాపెండ్లం నొప్పెక్కువైపోయి గొంగట్ల బొర్లుకుంట కొండ కీకెలు బెడ్తాంది- నేను ఆబరత్తంగ దాసగ్గరికిపోయి "ఏందె, ఏందె" అనుకుంట దాన్ని గట్టిగపట్టుకున్న- గది ఎసుమంటి మనిశి? ఈ మూన్నెల్లల్ల ఎండిపోయి వరుగోలె అయింది- దాన్నిజూత్తె నాదుక్కం

అగలే- నన్ను అనుకోనికు సోని "ఇగ నావశంగాదు, నేను బత్క-" అని నా మొక మంత ఎండిపొయిన శేతులతోటి పునుకుతాంది- గింతల గాల్లొల్లికి పక్కింటి రాజవ్వచ్చింది- "ఊకోవె మల్లక్కా! శిన్నపిల్లోలె ఏందెగిది?" అనుకుంట నాపెండ్లాన్ని సముదాయించి నేను ఇగలేశిన- "రాజవ్వ! గిదీన్ని సూస్కుంట ఉండే- నేనుగిప్పుడే ఈడిదాక బొయత్త!" అనిలేశి తలుపుశెక్కమీది గొంగడిదీశి బుజానవేసుకున్న- "జెప్పనరా" అని రాజవ్వ అంటుండంగనే బయిటికచ్చిన- దబ దబ నడుసుకుంట కొమటి సత్తెయ్య ఇంటిదాక బొయిన- పొయ్యేటాల్లకు కొమటోడు మాదిగముత్తితోని పరాశ్కాలాడుతాండు- గదేమో వీన్ని జూత్తనేలేదు- నేంబోంగనె ఇగిలిచ్చుడు బందుజేశిండు- జెప జెప పొట్లంగట్టి మాదిగముత్తిని ఎల్లగొట్టిండు- "దండాలు బాంచెను" అని గొంగడి కిందేస్కొనికూకున్న- "ఆఁ ఆఁ ఏందిర బుచ్చిగా ఎటోవస్తివి?" అన్నడు కొమటోడు- "ఇంకాడికి? సుకమచ్చినా దుక్కమచ్చినా మీ అసొంటి పెద్దింట్లకేనాయె" అన్న.

"మరిప్పుడు సుకంతోని వస్తివా? దుక్కంతోని వస్తివా?" అని కొమటోడు ఎక ఎక నవ్విండు- నేంగూడ ఎర్రినవ్వు నవ్విన- వాడు చింతపండు బస్తోలిగున్నడు. బొర్రమీనికెల్లి మాశిబోయిన జంజిరం నల్లగ ఏలాడుతాంది- గిట్లసంగతని అంతజెప్పి "పైసలుగావాలె బాంచెను- ఎట్లనన్నజెయిండ్రి ఒక్క ఇన్నూరుజాలు" అన్న- గంతలకె వాడు గల్లడబ్బ లటుక్కున బందుజేశి "అబ్బో, పైసలాడ ఉన్నయిరా" అన్నడు నాకు గాయింత దెల్వదా? ముఁద్గాల గట్నే అంటడు గని ఆకరుకు వాడు జెప్పిన మిత్తికి ఒప్పిచ్చుకోని మాగ పైసలిత్తడు- గందుకే వదులకుంట "మీరు గాకుంటె ఇగెట్ల!" అన్న బతిమాల్నట్టు- బతిలాడిచ్చుకోని, బతిలాడిచ్చుకోని ఆకరుకు వాదొక్క ఉపాయం జెప్పిండు- నాగొర్రెజీవాలన్ని దెచ్చి వానికి తాకటబెడ్తె ఇన్నూరు ఇత్తనన్నడు- నాకు నాకు పచగొట్టున్నయి- గయిదెచ్చి వీనికిచ్చి నేనాడబోవాలె? గీ ఉపాయం నాకెరికే- ఎ....ఎఁ.... ఇచ్చిరొండొర్రజులు కాంగనే "ఇగదే నాపైసలు" అంటడు- ఎల్లకపోతె మిత్తి పెంచుతడు- గామిత్తిగట్లనే పెరిగి పెరిగి అసలుకుగల్సి ఆకరుకు నీసొత్తుకు, నా రూపాలకు బరాబరైంది అంటడు. గామూటేవాన్తోటి అన్న.

"గట్లయితె మరిపైసలద్దా?" అన్నడు కొమటోడు.

"అట్లయిందానికి మంచిగ పోతతించిన జీవాన్నమ్ముత ఇన్నూరియ్యండ్లి" అన్ననేను.

"గొర్రెపిల్లను నేనేంజేస్కొవాలొర్రి! నువు నేంజెప్పింది మల్లోసారి ఇశారించుకోని రాపో!" అని లేశిఇంట్లకు బొయిండు. నేను అడివిల తొవ్వదప్పిన మ్యాకపిల్లోలె తల్కాయె ఏలాడేసుకోనివచ్చిన.

వచ్చేటాల్లకు నా గుడిసెకాడ ఇరుగుపొరుగంత జమయిండ్లు. "మల్లేమయిందిరో" అనుకుంట లోపలికచ్చిన- గాడసాపల నాపెండ్లాం పండ్కోనిఉన్నది. దానిడొక్కలు ఎగుర్తానయి- ఊపిరిపీల్చుడు కట్టమైతాంది. "బుచ్చన్నా ఇగనన్న పెద్దాపుకానకు తీస్కపోకపోతె మల్లవ్వ మనకుదక్కదే" అన్నదిరాజవ్వ- నాకు గంతలకే కండ్లనీల్లు బొటబొటకారినయి- "యాన్నన్న పైసలకు జూడకపోయినావుర!" ఎంకటిగాడు నా బుజంమీన సెయ్యేసి అన్నడు నాకుమండుకచ్చింది.

"బోడపరాశ్కమాడ్తానావుర! పైసలాడదొర్కుతయి? తెల్వనట్టేజేత్తానవు!" అన్న- ఆయింత ఎంకటిగాడు మొకం శిన్నబుచ్చుకున్నడు- నాకు పెయ్యంత శిటశిట లాడింది- నీయక్క గిడకూసుంటె పనిగాదు మల్ల మంది మాటలంటాంటరు అని మల్లబయల్దేరిన- "యాడికిబోతానవురో నేనత్తాగు"అని ఎంకటిగాడు రాబోయిండు- "లే- లే- నువ్వీన్నేకూసో"అని కుమ్మరిగోవిందు ఇంటిమొకానబొయిన- పట్నం తీస్కపోవాల్నంటె బస్సుమీదపోవాలె- బస్సుతొవ్వకు మావూరు ఎనిమిదిమైల్ల దూరానున్నది- గీ ఆమెడదూరంఎట్లబోవాల్నంటె నడిశిపోవుడే- గిప్పుడునాపెండ్లాం నడిశెటట్టులేదు- బండిగావాలె- గీవూల్లె బండ్లెవ్వనికీలేవు నల్గురికితప్ప- రెడ్డోడు అసలు ఇయ్యనేఇయ్యడు- గవాన్దాక పోవుడుకంటె పెద్దపులినోట్లె తలకాయబెట్టుడు మంచిది- పట్వారోనికి వున్నదిగని వాన్నడుగుడు కంటె పాంపుట్టల చెయిసూకుడు మంచిది- కొమటిసత్తిగానికున్నది. గిప్పుడు అప్పేఇయ్యకపాయె బండేడిత్తడు? ఇగవున్నోడు కుమ్మరిగోవిందు- దానిమీద కుండలేస్కోని ఊరూరు దిరుగ్గుంట అమ్మతడుగాబట్టి ఆయింత వానికొక్కనికున్నది- ఇగఎవ్వనికీలేదు- ఇప్పుడుబండిత్తె గవాడొక్కడేఇయ్యాలె- దబదబ నడ్సుకుంట పొయెటాల్లకు నుల్కతాడు పేనుకుంట కూసున్నడు గోవిందు.

"ఏందేబుచ్చన్నా, మల్లవ్వబాగలేదటగదనే!" అని పల్కరిచ్చిండు.

"బానే! గిట్లసంగతున్నది- జరంత నీబండిగావాలె" అన్న.

"గదాన్దేంభాగ్గెం? నువుమల్లరాపో- గొడ్లు కుంటకొమ్మున మేయబొయినయి. ఆటిన్నేను తోలుకత్తగని నువు తయారుగుండు" అన్నడు- అమ్మనాయినా! నా పానాలు నిమ్మలమైనయి- గుండెదిట్టంజేస్కోని ఎన్కకుదిర్గిన.

గిదంత నాకునాకే ఇశారంగ, ఇచ్చంత్రంగ ఉన్నది- పట్నంబొయినంక రొండుగొర్లు అమ్మయినాగూడ నా పెండ్లంపానం నయంజేయిచ్చాల్నని అనుకున్న- గీడ కోమటోనికి అమ్ముడుకంటె గక్కడమ్ముడేమంచిది- ఆకరుకు కన్నకొడుకులు,

సుట్టాలు, పక్కాలు ఎవలు అక్కెరార్రికుంటయిరిగద- మొదట్నుంచి గొర్రెజీవాల నమ్ముకోని బతుకుతుంటి- అకరుకు ఇయ్యాలగూడ అవ్వేదిక్కయినయి. మా అయ్య సచ్చినప్పుడు, అవ్వసచ్చినప్పుడు, నా పెండ్లప్పుడు, కొడుకులు బిడ్డలుపుట్టినప్పుడు, వాల్లపెండ్లిండ్లకు, వాల్లకొడుకులుబుట్టినప్పుడు, ఎప్పుడుజూశినా, సావుల, బతుకుల, సుకంల, దుక్కంల అన్నిటికి గొర్రెజీవాలే దిక్కయినయిగని గీ మనుసులు ఎప్పుడన్న ఆదుకున్నారు? ఊల్లె ఒక్కొక్కనిదగ్గర గింత పైకమున్నది. ఎవడన్న అక్కరకు దగ్గెరికచ్చిండా? నన్నుసూదార్రిదుండిర్రి ఎసువంటిసంసారం ఎట్లయిపాయె- నా దొడ్డి నిండ ఎప్పుడుసూశినా గొర్రెలు, మ్యాకలు మెకమెకలాడుకుంట ఉండేది. ఇమ్మారు గొర్లు, యాబై మ్యాకలు, గవన్నిగిప్పుడెవ్వి? రెడ్డోనిదొడ్లె కొన్నున్నయి కటికోని శేతుల కొన్నిబడ్డయి. గదేమరిగమ్మతు! నా కుపండ్గకు, పబ్బానికి అవ్వ..రమైతెనో, బియ్యపుగింజల్లేకుంటెనో ఉన్న గొర్రెలు మ్యాకలు అమ్ముకదొబ్బిన. గదే పట్వారో నింట్ల బిడ్డపెండ్లయితె నేను పున్యానికి గొర్రెపిల్లనిచ్చిన- కాపోల్లసమ్మయ్య తోట్ల పండిన కూరగాయలెచ్చి ఇచ్చిండు- కోమటోడు అయిదువీశెల నెయ్యిపోశిండు. రైతులంతగల్సి పందుంవడ్లు జమజేశిచ్చిండ్లు. ఎట్టిశాకిరికి సాకలిఇస్తారిగాడు, మంగలి సోమడు, ఎలోడు ఉండనేఉండిరి. వానికార్యమేమొ గప్పెల్లిపోద్ది. నా అనుమంటోని కేమొ గితిప్పలు. నీయక్కదేశం....

గిట్ల ఇశారం జేసుకుంట మల్ల గుడిశెదాకపొయిన- గాడ ఒగలొల్లిగాదు. మా రాజవ్వ, చినమల్లి, బుచ్చిరాము, కొమిరి నా పెండ్లం దగ్గెర కూకోని తీకనాలుతీత్తార్రి. నాకు కిందికెల్లి మండుకచ్చింది.

"గిదెక్కడి కతరో! ఉన్నది పైసంతయితె పదిరూపాలు జేత్తార్రి మంది" అనుకున్న.

"దూత్.... లేదిర్రి! అగమాగం జేత్తార్రి అంత- ఏమైందిపుడు? బండి మాట్లాడుకచ్చిన- ఇగ పట్నంతీస్కపోత- అడ దన్వంతరసొంటి వైదుగులున్నరు- ఇంజేషనిచ్చిరాంటె మల్ల ఎమదర్మరాజసొంటోడు తీస్కపొయ్యేపానాలు వదిలిపెట్టి పోవాలె-" అని నవ్వుకుంట పెమత్కారంగ అన్నట్టుఅన్న- అన్నగని గామాటల్ల దైర్నంలేదు- ఏ-ఏంలేదుర్రి అని అనిపిచ్చాల్నని వట్టిగనే అన్న- కని అన్ని గాలి మాటలొలిగున్నయి మా బుచ్చిరామికి గామాటలకు కోపమచ్చినట్టున్నది నన్నుకోశి పారేశెటట్టు సూశింది.

"తూ.... నీయవ్వ మొండి గుండెల ముండకొడుక ! మనిషి సావుబాదలపత్తాంటె ఇగిలిచ్చుకుంట మాట్లాడెటానికి శిగ్గులేదు- మల్ల బండిమాట్లాడు కచ్చినంటాండు- ఈ దేశముకు కోసం ఎవలో ఇత్తరటబండి.... సోయిఉన్నోడు గిట్లనేవుంటాడు ?" అన్నది నాకు మాశికాకయిపోయింది. "నీయక్క లొల్లి...." అనుకున్న- గింతలకె గోలెం ఈరిగాడచ్చిండు వాడు దానిమొగడే "నీతల్లి.... నోర్మూయ్యే నువ్వు ! బండనంగనె దొర్కుతదనుకుంటానవ ? ఈ పూల్లె బండున్నోడు ఎవడే ! ఎవన్నో ఆముదంబెట్టి గీకాలె- గప్పుడు అది రావాలె- పున్యానికే అత్తాదిబండి ? బండి దెమ్మడంటె పెరట్ల శిక్కుడుగాయలు దెంపుడనుకుంటానవ ?" అన్నడు- గంతట్లనె అదినోరుమూసుకున్నది- నేను గక్కన్నే అరుగుమీనకూసుండి సుట్టముట్టిచ్చుకున్న- గుప్ప గుప్ప పొగడుత్తాంటె గాపొగ సాయలకెల్లి నాయిల్లు, నాపెండ్లాం, మంది అందరూ మస్కమస్కోలె కన్పిత్తారప్పి- నాశిన్నప్పుడు, దేశసంచారం జేస్కుంట బాపనాయినె ఒగాయినె వచ్చిండు- గాయినె "బిడ్డా ! గీలోకమంత వట్టిమాయలోకంరా- నీగ్గనపడేదంత నిజంగాదు. నిజమనేది ఒక సత్తెపదార్తం. దానినీడలు ఈ లోకంల మనకు కండ్లకెదురుంగ కనిపిస్తయి- అసలు సత్తెం వేరేవుంటది- గది మనగ్గనపడది- గదాన్ని జూడాల్నంటె మోచ్చం పొందాలె- మోచ్చం పొందుడంటె ఏందనుకుంటానవు పరాశ్కంగాదు" అన్నడు- నాగ్గీసంగతి అంతుతేల్చుకోవాల్ననిపిచ్చింది "మరిగనాకు మోచ్చమార్గం జెప్పుండ్రి బాంచెను" అన్న- గప్పుడాయినె ఒగ మంత్రం జెప్పిండు- గదేందొ గమ్మతుగున్నది- నాకునోరేతిర్గలే- "సామీ ! గిట్లనాతోనిగాదు- ఏదన్న సులువుమార్గం జెప్పుండ్రి" అన్న- గప్పుడాయినె ఇగ ఆలోశిచ్చిండు- ఆలోశిచ్చి ఆలోశిచ్చి ఆకరుకు "బిడ్డా ! నీకు సంస్కృతమంత్రాలు రావురా ! నీకు అలుకగ ఉండేది ఒగటిజెప్తఇను" అని గిట్లజెప్పిండు. "బొల్లిగద్ద నాసామి ! కాపాడరావయ్య" బొల్లిగద్ద అంటె గరుత్మంతుడు గదానిమీనెక్కెటోడు నారాయినమూర్తి- గాయినెను తల్సుకునుడన్నమాట- "నీక్కష్టకాలమచ్చినప్పుడు గీమంత్రం సదువుకోర !" అన్నడు ఇరుసవడ్లు, ముంతెడునెయ్యి గిరొండు మాటలు జెప్పినందుకే దొబ్బిపోయిండు- "కార్తీకమాసంల సలిబెడ్తది ఒక గొంగడియ్యరా" అని అదొకటి ఏస్కోనిపోయిండు.

ఇగ గాతర్వాత నాకెన్నెన్నో కష్టాలచ్చినయి- గప్పుడు గామంత్రం ఒగ సదువుడు సదువలే ఇగ- కష్టందీరుడు అటుబోయి ఉన్న జాయిదాతు అంత పోలెగని కష్టాలు దీరలే- "నీతల్లి ..." అనుకోని ఆమంత్రం వదిలిపెట్టిన- ఆపదలచ్చి మీనగూకుంటె మంత్రం జదువుతెపోద్దా ? గప్పట్నుంచి గీమంత్రాలు దేవుతలు అందర్ని అదిలిపెట్టి కూకున్న- మొన్న పెద్దేవర కొలుపెందుకు జేశిన అంటె గింతంత ఆశ ఏన్నో సుక్కోలె

నాలోపల ఎలుగుతాండె- నీయక్క- గొర్రెపోతు పోతె పామెగని పెండ్లంకంటెక్కువా? అనుకున్న- అదిగూడ దీరిపొయింది- దేవతలేమన్న వైద్గులా రోగంనయంజేశెటానికి! అన్నందింటె ఆకలిపోద్ది. మందేత్తె రోగంబోద్ది గంతేముచ్చట- అండ్ల ఇశారంజేశె టానికేమున్నది! గిట్ల ఆలోశనజేస్కుంట కూకుందెటాల్లకు పుట్టఅయిపొయింది- అదటుదిక్కు- పొర్ల్యాకి "ఉశ్కో" అనుకుంట లేశినిలబడ్డ- సుట్టూతజూశిన- మంది అంత తలోమాట వాల్లల్ల వాల్లే మాట్లాడుకుంట నాదిక్కుజూత్తాండ్రు- గోలెం ఈరిగాడు నాదగ్గరికచ్చి "పో-పోరాదే జెప్పవబొయి ఎవన్నడిగినవో బండిదేరాదు!" అన్నడు.

"అవుర! కుమ్మరి గోవిందు ఇంటిదాకపొయ్యొత్తరా! బండిత్తనన్నడు పట్టుకత్త"అని బైల్దేరిన.

"ఆఁ ఆఁ జెల్దిబొయిరా- ఆలిసెంజేత్తె అపాయమైతంది" అన్నడువాడు. నేను నా పెండ్లాన్ని జూశిన. మైకంగమ్మినదానోల్గనే పండ్లోనిఉన్నదది. "గిదేందిరో! ఉన్నదా ఊశిందా?" అనుకుంట దానిపెయిముట్టుకున్న. రాజవ్వ కసిరిచ్చికొట్టింది. గిట్లనే నువ్వు సూస్కుంటజేరుతె అదినిజంగనె సచ్చిపోద్ది" అన్నది. నేనులేశి దబదబ బయటి కచ్చిన. బువ్వల్దినేయాల్ల దాటింది. ఊల్లెఅంత సప్పుదులేకుంటనే ఉన్నది. ఐనా గీయాల్లకెవడుంటడు! మల్ల శీకటిదెటప్పుడుగని రారు. బజారుపొంట శెట్లనీడున్నకాడ పొల్లగాండ్లు బొంగురాలాటలు, బచ్చాలాటలు ఆడుతాండ్లు, కొందరుపోరగాండ్లు ఉశికెల గుడ్డేలుగులు పడుతాండ్లు. కాపోల్ల కిష్టయ్యపెరట్ల కొందరు పొల్లగాండ్లు శింత కాయలు కొట్టుకతింటాండ్లు. గ పోరగాల్లను సూశెటాల్లకు నాకు నా శిన్నతనం యాది కచ్చింది. ఎంత ముద్దుగుండేటియి గారోజులు గిట్లనే ఆటలాడేది. ఈతలుగొట్టేది. గసుమంటి రోజులన్ని పొయినయి. నేను సంసారంలబడి గిన్నితిప్పల్లుపడబడ్తిని.

గింతట్లకె కొమటోని దుకానమచ్చింది. గౌండ్ల యాదమ్మతోని పరాశ్కమాడు కుంట కోమటోడు నాదిక్కుసూశి "యాడికిబోతానవురో!" అన్నడు. "గిడికే"అన్న నేను అగకుంటనే- "మంచిది మంచిది పొయిరా!" అన్నడువాడు ఎటకారంగ నవ్వు కుంట నేనాడికిబోతె గీపిసికెందుకు అనుకున్న. "నీయక్క.... గొల్లోనిబతుకెంత అవ్వామన్నమై పొయిందిరో" అని దుమాలదీసి మొకంతుడ్సుకున్న.

ఎండ శిటమటలాడ్తాంది- నాకు గుండెలు గుబగుబలాడ్తానయి- నాపెండ్లం నలబై సంవత్సరాలకెల్లి నాతోటి కట్టసుకాలల్ల పాలుబంచుకుంటాంది- నేనేడిత్తె దాని కండ్లల్లగూడ నీల్లు గిర్రగిర్ర తిర్గుతయి- నేన్నవ్వితె దానిమొకంగూడ పెద్దగొంగడంత యిప్పుకుంటది- గసుమంటిదానికి పానాంతుకమైతె ఏంజెయ్యలేకపోతిని. శీ- నీయక్క....

గిట్ల ఆలోశనజేస్కుంట పోయెటాల్లకు కుమ్మరిగోవిందు సావట్లగూసోని శిన్న కొడ్కును ఓల్లె గూకోబెట్కోని "గింతంత బాగురబిడ్డ! ఒక్కటుక్కపీలువు, ఏం గాదురా మంచిగుంటది" అని సుట్టఅందిత్తాండు- గాశిన్నపోరడు "ఊఁ వేవఁద్దే" అని మొకం దిప్పుకుంటాండు. నన్నుజూడంగనె పిలగాన్ని ఓల్లెకెల్లిదించి "రాయే, కూసో!" అని అరుగు సూపెట్టిండు- "అబ్బో! కూకునేటట్టు యాడున్నది జెప్పన బండిదోల్కపోవాలె" అన్న.

"పోదువుగని కూసో" అన్నడు గోవిందు.

"లే.లే. పోవాలె- దానికి పరీశాన్‌గున్నది" అని అట్లనే నిలబడి అటిటుజూశిన- గొడ్లు యాడగనబడలే- బండిమాత్రం ఆన్నేఉన్నది- "ఎడ్లెవ్వి? తోలుకరాలే!" అన్న.

గోవిందు నాదిక్కు శిగ్గుపడుకుంట సూశిండు- "ఆఁ పొయినగని ఎడ్లులెవ్వఆడ" అన్నడు.

"అదె?" అన్న ఏందోవున్నదిరకతో అనుకుంటనే.

"ఇగో బుచ్చన్నా! పెద్దోల్లతోటియవ్వారం! మనం మనం సదురుకుంటంగని వానితోని పెట్టుకోజాలుతమా!" అన్నడు గోవిందు.

"ఎవన్తోటిరో?"

"గదే కోమటోనితోటి! వానిగ్గిప్పుడే పట్నంబొయ్యే పనున్నదట- వాని వడ్ల బత్తాలు మార్కెటుకేస్కబోవాల్నట, బండెడ్లడిగిండు" అన్నడు గోవిందు తలకాయె వంచుకోని.

"వానిబండిబోంగ ఇదిగూడా గావాల్నటనా?"

"అవునట!"

వానిగొంతు వనికింది.

నాకు కాల్లకిందిబూమి కదిలినట్టనిపిచ్చింది. "అంటె గిప్పుడెట్ల బండిలేకుంటె మరి? నాకిత్తనంటివిగద!" అన్ననిర్వంగ.

నేనేంజెయ్యాలెజెప్పు! కోమటోనికి కొత్తలుబాకివుంటి, ఎడ్లుబండియ్యకుంటె అవిదెమ్మనికూసుంటడు. పైసలియ్యాల్నంటె ఏదన్న తెగనమ్మాలె. పోనీఅనిఆన్తోటి పంచాతిపెట్టుకుంటె రేపేయాల్ల ఎట్లుంటదో. గివన్ని అయ్యేపనులేనాజెప్పు? గోవిందు ఎటోసూస్కుంటఅన్నడు. నాకు కోపమచ్చింది. ఇశారమైంది. ఉద్రేకం పెరిగిపోయింది- ఐనగూడ అనుసుకోనిఅన్న.

"మరిగ ఎట్ల? బండికావాలెగదనాకు! దొపకదంటవా?"

"ఏంజెయ్యమంటవు కత గిట్లున్నది- నీకేమొ ఇయబుద్దైతాంది- కోమటోన్తోని పంచాతైద్ద నిబయమైతాంది" అన్నడు గోవిందు. నాకిగకోపమాగలే బుస్సున తాసు బామొగ్గె లేశిన. "అవురారి! మీరంత వానిశేతికింద బతుకుతారురి. వాడు సోలెడు పప్పు మానెడుబియ్యం ఇత్తె బతికెటోల్లుగాదుర మీరు! వానిమాటినక నాకష్టసుకాలు సూత్తారారి! నా అవుసరానికాదుకుంటారురి! నేనుకూడ మీవోల్గనే బతికెటోన్నిరా! మీతోటోన్నిరా! నాపెండ్లం సావుబతుకుల్లున్నది. గదానికేమొ బండియ్య శాతగాదు, వాని అడ్లు మార్కెటుకేస్కపొయెటాన్కి ఇత్తరారి! గావడ్లన్ని యాడియిరా వానికి? గది ఆలోశించినారురి? వాడు జెప్పినట్టినకపోతె రెడ్డోన్తోని, పట్వారోన్తోని జెప్పి మీ బతుకుల అగ్గిరేపుతడువాడు. కని గిదెంతదూరంపోద్దో ఎర్కనార? గిసుమంటికాలం నీకుగూడ అత్తదిరా! గప్పుడు నీమీద ప్రేమజూపెట్టే కోమటోడు ఏంజెయ్యడురా! గప్పుడు గీగొల్లబుచ్చిగాని మాటలు నీకు యాదికత్తయిరా! సూస్కో-ఇదేవామాట- శిలాచ్చరం - శిలాచ్చరం రా అరేయ్" అని శాపనార్ధాలుపెట్టిన. గివన్ని నేను కడుపుబ్బరంతోటి అన్నయిగాదు. నిజంగ నాకడుపులకెల్లి అగ్గినిప్పులోలె దున్కినయి. మనసుల జెకముకి గొట్టినట్టయితాంది. ఇంగ ఏం మాట్లాడకుండ ఎన్కకుదిర్గి బిర బిర నడ్సుకుంట నాఇంటిమొకంబట్టిన.

కోమటోని దుకానం ముందటికెల్లిబోతాంటె ఆడు పండ్లిగిలిచ్చుకుంట "ఏమిర బుచ్చిగా! ఆగమాగం బోతానవు?" అన్నడు.

నాకు పెయిమీదదెల్వలే. "థూ! అరేయి నామాలకోమటోడ! నామొకం ముందట ఏదన్న జేపెదైర్నం ఉన్నదిర నీకు? నీకు గౌర్రిపిల్లలమ్మ లేదని గింత కైలాటుకం జేత్తావుర? గిదీంతోటి ఏమైద్దిరా? నాకు తిక్కరేగిందాంటే గౌర్రితిత్తి దీసినట్టు దీత్తబిడ్డ!........" ఇంకేమందునో గని గంతట్లకే గోవిందు ఉర్కచ్చిండు- "బుచ్చన్న! అగాగు గట్లమాట్లాడ్తె ఎట్లనే? జరఎన్కముందు జూస్కోవాలె" అన్నడు

"నా యెన్కనేవత్తానావుర, పిరికిగాడ్దికొడ్క! నీ అసుమంటోల్లు ఉండె పట్టె నేరా గిపీల్లు తెగాంచేది. శీ! నియ్యత్‌లేని బతుకులారిపీయి. ఎవడునాకుసాకారం జెయ్యకపోతె సత్తననుకున్నారురి!" మండుకుంట అన్న. గోవిందు మొకంమాడ్సుకున్నడు. "సరెబిడ్డ! వస్త" అని నాయింటి దిక్కుపోయిన.

నా గుడిశెకాడికి పోంగనే అందరు గిరుక్కున తిరిగి సూశిండురి. నాకు కండ్లల్ల నీల్లుదిర్గుడు బందయి నిప్పులు దున్కతానయి. అందర్ని ఇగ గుర్రుకాయించి సూశిన. నాపెండ్లం గట్లనే బొంతలపండి మూలుగుతాంది. అందరు మంది సుట్టుజేరి ఉన్నరు.

"ఏందుర్రి! అర్సెటోడుగాదు తీర్సెటోడుగాదుగని పొద్దుకు పదిసార్లడిగెబోడని మీసంగతేంది? పెండ్లం గిట్లుంటె గివీడు గింత తీర్పాటంగ తిర్గుతాండని సూత్తార్రి?

నేను పేదోన్నిరా, నాకెవడు సాయంజేత్తర్రి? నేంజత్తాంటె సూశిసంబుర పడెటోల్లున్నర్రి! నారగుతం నీరైపోతాంటె దాంట్ల పంటలు పండిచ్చుకునెటోల్లున్నర్రి! నా అక్కెర పానంమీది కచ్చినంక ఉన్నజాయిదాతంత పున్యానికి దొబ్బెటానికి సూశె టోల్లున్నర్రి! నేను అరిగోస పడ్తాంటె బాగోతం సూశినట్టు సూశెటోల్లున్నర్రి, అరేయి గోలెం ఊరిగా, నాపెండ్లం ఎసుమంటిదిరా! గోవుమాలచ్చిమికంటె దాని మనుసు సుతారంరా! అది ఎందరి బిడ్డలను కన్నబిడ్డకోలిగె సూసుకున్నదిరా! ఊల్లె ఎవనిపిల్లల కేమచ్చినా ఇదక్కడికి తయారై ఎల్లసూసుకున్నదిరా? ఎన్నివైద్గాలు జేశిందిరా, ఎందరి ఇండ్లల్ల పెండ్లిల్లయితాంటె ఎన్ని శావలు జేశిందిరా, గసుమంటిది గియాలగిట్లున్నదంటె ఎవడన్న ఒక్కడుసాయం జేత్తాండా? ఆకరుకు బండిత్తనన్నోడు గూడ కోమటోనికి బయపడి తెడ్డుజూపెట్టిండు. వానింట్ల-గదే గాకోమటోనింట్ల గిదెన్ని పనులు జేశిందిరా! గదివాడు ఇయ్యాల మర్శిపోవచ్చుగని వారీ! నేన్దానిమొగన్నిరా, కట్టుకున్నోన్నిరా! దాని బాగోగులు సూశెదర్మం నామీదున్నదిరా.

అరేయ్- గిదంతసూత్తాంటె నాకు ఊరబదుర్రిడు పూన్తాండు- శివాలెత్తుతానయి- ఎల్లెల్లెల్లె........... అరేయి ఎవ్వడు వానిసుకమే సూస్కోనీరా, కనివారీ మీరంతా నావోల్లే! గదేనాకుబలంరా! అరేయి నన్ను ఏందోజెయ్యాల్నని పెద్దింటోడు నాకు బండియ్యనియకుండ జేశిండు- గదేంజేత్తదిరానన్ను? నాకింక నా బుజాల్లల్ల సత్తువ బోలే. బండిలేకుంటేందిరా ఆమెడదూరం దాన్ని బుజాలమీన మోస్కపోత. రొండు గొర్లమ్మి వైద్గంజేయిత్త. అరేయి నాకష్టకాలంల మీరన్న కంటడిబెట్టిండ్రి సాలర్రి బిడ్డా గయింతసాలు. గదేరానాబలం- గదేరా నాసత్తువ." అని పెయిమీద దెల్వైకుంట పొయి రొండుగొర్లుఇప్పి తాడుగట్టి చేతులబట్టుకున్న. నాపెండ్లందగ్గరికచ్చి దాన్ని ఓసారి నిండారసూసుకున్న. "లేర్రి- దూరంజరుగుర్రి"అని అందర్ని దూరంజరిపి బొంతతోటిపాటుగదాన్ని ఎత్తి బుజంమీనఏస్కున్న. గప్పుడునాకు ఏం ఊరావేశం పూనిందోగని ఇంతంత బలంరాలేనాకు. నా పెండ్లాన్ని బుజాలమీనఏస్కోని మావోల్లంత ఎంబడిరాంగ బిరబిరనడ్శిన. గొర్లు నా ఎన్కనే అత్తానయి. ఊరుదాటి నంక మావోల్లంత పొలాకల్ల ఆగిపొయిండ్రి నేనుమాత్రం గదేకడుకతోటి ముంగలికి నడ్సుకుంట పొయిన. ఈపుమీన నాపెండ్లం కండ్లల్లనీరు సుక్కలు సుక్కలు పడ్తాంది.

# సవారీ

తుమ్మేటి రఘోత్తంరెడ్డి

ఉత్తరంఇచ్చిన అవ్యక్తిని ఆపాదమస్తకం ఓసారి పరీక్షగా చూశాడు. చెమటతో తడిసి ముద్దఅయిపోయాడు ఆ వ్యక్తి.

"నమస్తే....! అనికూడ అనకపాయె ఏందీ? ఆఁ...." అనుకున్నాడు ప్రతాప రావు దొర.

"పేరేఁమిటి?" దొరగారి ప్రశ్న.

"నారాయణ" అవ్యక్తి జవాబు. కళ్ళజోడు సవరించుకుని ఉత్తరం విప్పాడు ప్రతాపరావు. బావమరిది రాసినట్టుంది సంతోషం వేసింది. 'గట గట' చదవడం మొదలెట్టాడు.

ఉత్తరం చదివి సంతృప్తిగా నిట్టూర్చి నారాయణని ఉద్దేశించి.

"ఇంతేనా? ఇంకేఁపైన నోటి'మత్‌లబ్' చెప్పాడా?" అని అడిగాడు.

"ఊఁహూఁ ఏంచెప్పలేదు. జెప్పన రమ్మన్నరు గంతే" అన్నాడు నారాయణ.

"సరె నువ్వు వెళ్ళు" అన్నతర్వాత సైకిల్ తీసుకుని వెళ్తున్న నారాయణ కేసి మరోసారి 'గుర్రు'గా చూసి.... ఉత్తరం మడిచి జేబులో ఉంచుకున్నాడు. వేపచెట్టు చాటునుంచి "బర్రె" కట్టె కన్పిస్తోంది.

"అరేయ్ మల్లిగా...." అంటూ పిలిచాడు ప్రతాపరావు.

"అయా...." అంటూ వచ్చి ఆయన కూర్చున్న వాలుకుర్చీకి కొంత దూరంలో వినయంగా నిలబడ్డాడు మల్లిగాడు.

"నువ్వుతొందరగపొయ్యి సాకలోన్ని పిల్చుకరావో. నడువ్ తొందరగపోవాలె."

"అయ్యా"అంటు తల విలువగాతిప్పుతూ, పాతపంచను బుజంపై సరిచేసుకుంటు పరుగులాంటినడకతో చాకలి వాడవైపువెళ్ళాడు సుంకరి మల్లిగాడు.

వెళ్ళగానే బావమరదితో మాట్లాడవలసిన విషయాలగూర్చి ఆలోచనలో పడి పోయాడు ప్రతాపరావు- మాదిగల క్వార్టర్సు కంటాక్టు, హైస్కూల్‌బిల్డింగ్ కంటాక్టు ఇంకా పెద్దపెద్దవి చాలాచాలాఆలోచించి వెతికి పట్టుకుని 'దీపంఉండగానే ఇల్లు చక్క బెట్టుకోవాలి' అని అనుకోకపోయినా అటువంటినిర్ణయానికి వచ్చాడు- పావుగంటలో ఎదురుగావస్తున్న మల్లిగాన్ని చూసి.

"ఏఁవాయెరా?" అంటూ నుదురుచిట్లించాడు.

"వాడు రాలేదుదొరా- పోరన్నితోలిండు" అంటూ వెనక్కితిరిగాడు పోరనికోసం. గోడపెచ్చులు ఊడదీస్తూ కొద్దిదూరంలో నిలబడిపోయాడు.

"అదె? వానికేంచైందట?" రావుగారికంఠంలో విసుగు కోపం.

"ఊరుడుకుమగ్గినవోలె నొప్పులుమొదలై గిప్పుడు గిప్పుడే ఎగిలివారంగ కాన్పు అయింది- నేను వాయిలాక్లో తక్లలాక్లో పోవల్సిఉంటదనిచెప్పి కొడుకును దోలిండు బాంచెన్."

"నొప్పులు పెండ్లానికా? బిడ్డకా?" నిజం తెలిసికూడ అడిగాడు వ్యంగంగా ప్రతాపరావు.

"వాని పెండ్లానికేదొరా! కొడుకుపుట్టిండు-" మల్లిగాడు.

"తూ.... నీయవ్వ! సిగ్గులేదురా? కొడుకులు, బిడ్డలుకనేఈడుకచ్చిందా ఇంకా వాడు పోరగాండ్లకనుడా? వానవ్వ బరుకతి తక్కువ.... సంఘాలు, గింగాలుబెట్టి భూంవులుకావన్నని, జాగలుకావన్నవి సింగసానంపేత్తరుగని గిట్ల కుక్కలుగన్నట్టు పోరగాడ్లకనవద్దని చెప్పరేందిర మీవోళ్ళు" అంటూ లేచినిలబడి

"ఏడి ఆపోరడు? బండిఅంత ఉరికత్తడా?" సందేహంగా అడిగాడు.

"అదె? వానికేండొరా? దుడ్డెపిల్లపున్నట్టువున్నడు ఏంచైందివానికి?"

"ఇటారార పోడ గాదనిలవడ్తవి?" అంటు పోరన్నిపిలిచాడు మల్లిగాడు. వాడు నేలచూపులుచూస్తూ వచ్చినిలబడ్డాడు మల్లిగానిచాటుకి.

"ఏం పేరార?...." దొరగారి ప్రశ్న,

"ఓదెలు" అయిష్టంగా మొగంపెట్టి చెప్పాడు వాడు.

"సరె పొయ్యి బండి తయారుచెయ్యండిరా" అంటూ ఆజ్ఞ జారీచేసి బంగళా లోపలికి వెళ్ళాడు టిఫిన్‌తిని బట్టలు మార్చుకోవడానికి.

.... .... .... .... ....

పాలేర్లకి, పెగేదార్లకి చెప్పాల్సిన విషయాలు చెప్పి బండెక్కాడు ప్రతాపరావు దొర. పగ్గాలు చేతికి అందించాడు మల్లిగాడు. దొర ఓదెలు వంక చూసిండు అది చూసి మల్లిగాడు ఓదెల్ను ఉద్దేశించి.

"నడువరా నడువ్ బండిముందట నడువు" అన్నాడు. ఓదెలు కొద్దిగా బిత్తర వోయి బండిముందు నడవసాగిండు. కాళ్ళకున్న పాత'హవాయి' చెప్పులు 'చిటుక్ చిటుక్' మంటుంటె. బండికికట్టిన కోడెలు పొట్టిగ దిట్టంగ ఉన్నయ్. తోకలు చురుగ్గా కదిలిస్తూ పరుగు మొదలెట్టినయ్. మెడలో 'గింగుర్లు' గలగల చప్పుడు

చేస్తున్నయ్. బండి ఊరుదాటింది ఊరు ఆవలి దొరగారి పెద్దమామిడి తోటదాటింది. బండిముందు పరుగెత్తుతున్న ఓదెలికి శ్వాస వేగం హెచ్చింది. ఎగబీలుస్తూ దిగబీలుస్తూ పరుగెత్తుతున్నాడు. మెల్లగా నడవాలన్పిస్తుంది. కాని కోడెలు కాళ్ళు తొక్కినట్టు పైపైకే వస్తున్నాయ్. 'బండికిందపడితె సచ్చుడే' అనుకుంట శక్తిని కూడ దీసుకుంట పరుగెత్తుతున్నాడు. ఊరు దాటిన తర్వాత బండెక్కమంటడో ఏమోనని ఆశపడ్డాడు. ఇప్పుడు ఆశకి అవధి ఊరి పొలిమేర చేసుకుని పరుగెత్తుతున్నాడు. దాపటి కోడెపగ్గం ఊడిపోయింది. దొర బండి బలవంతంగా ఆపాడు. దాన్ని మళ్ళీ కట్టడంకోసం కోడె ముందు నిలబడి కడుతోంటే అది కొమ్ము విసిరింది. 'ఫటక్'మని ఓదెలు తలకి తగిలింది. తల దిమ్మెక్కినట్టుఅయింది. పగ్గంకట్టి పక్కకి జరుగుతోంటె కోడె చెప్పుపై కాలువేసింది. గూడ తెగిపోయింది తలదెబ్బతో బాధపడ్తున్న ఓదెలికి అది మరింత బాధకల్గించింది. ఏడ్పువచ్చినంత పనైంది. బండి మళ్ళీ సవారీ మొదలెట్టింది. బండి వెనుక తడిక పట్టుకుని పరుగెత్తుతున్న ఓదెలికి తల 'ధిమ్ ధిమ్' అని ఒకటేబాధ పైగా ఓ చేతిలో రెండు చెప్పులు.

సూర్యుడు పడమటి కొండల్లోకి జారుతున్నాడు. ఆకాశం చిత్రవర్ణాలతో.... చల్లనిగాలి సంధ్యారాగం పాడుతోంది. వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది. 'మానేటి' గట్టుపొడవునా ప్రయాణం. ఏటిగట్టు, తాడిచెట్లు చాలా అందమైన దృశ్యాలు కదిలిపోతున్నాయ్. ఓదెలు ఇవేవి గమనించే స్థితిలో లేడు. వెళ్ళాల్సిన ఊరు ఎప్పుడు వస్తుందో? ఏమో? అనుకుంటూ బండికి కాస్తా వెనుకబడిపోతున్నాడు. అప్పుడప్పుడు వెనక్కిచూస్తున్న దొరగారు.

"నడవరా నడవ్ ఇగో ఈ కనవడే ఊరు దాటితె అచ్చేదె మనం బొయేది" అంటూ బండివేగాన్ని కొద్దిగా తగ్గించాడు. బండి ఏటికాల్వలోకి ప్రవేశించింది. గిత్తలు కాల్వలో ఆగాయి. దప్పిక తీర్చుకున్నాయి. ఇంకా తాగినట్టునటిస్తూ దమ్ముతీర్చుకోవడం కోసం మూతులు నీళ్ళపైనే ఆనించాయి. వాటితీరు చూసిన ఓదెలుకు నవ్వువచ్చింది. కాల్వ ఎగువకువెళ్ళి దోసిలితో నీళ్ళుతీసుకుని ప్రక్షాళించి ఉమ్మి కడుపార నీళ్ళుతాగాడు. తాటిచెట్లపైనించి గాలి రుయ్‌మని వీస్తోంది. తాటి ఆకులు గలగల శబ్దంచేస్తూ కదుల్తున్నయ్. ఆ గాలిలో.... ఆ ఆకుల శబ్దసంగీతంలో కలిసి ఎక్కడి నుంచో ఉత్తేజకరమైన పాట విన్పిస్తోంది. 'బండెనుక బండికట్టి పదహారు బండ్లుకట్టి ఏ బండ్లెవోతవ్ కొడుకో నైజాంసర్కారోడా........ అంటూ మైకులో కొంతమంది కలిసి పాడుతున్నట్టున్నారు. ఉద్వేగంతో.... ప్రతాపరావు దొర నుదురు చిట్లించి పాట విన్పిస్తున్న ఊరివైపు చూశాడు. విపరీతమైన జనసమూహం పోగైవున్నారు. ఇంకా దారీ తెన్ను

# నిర్బంధంలో సమ్మె

కార్మిక

ఉదయం ఐదున్నర....... సైరన్ కూత వినిపిస్తోంది. ఆకూత రోజటిలా వేలాదిమంది రక్తమాంసాలు భక్షించటానికి సిద్దంగాఉన్న బకాసురుని విజయ గర్వపు అరుపులాలేదు. భీముని చేత కోరలు పీకబడి కొరిప్రాణంతో కొట్టుమిట్టాడుతున్న ఆక్రందనలా ఉంది. ఆ కొరిప్రాణాన్ని కాపాడటానికా అన్నట్లు 20 మంది సాయుధ భటులు కాపలా కాస్తున్నారు.

ఎప్పటిలాగా బావి మీద.... అరచేతిలో ప్రాణం పెట్టుకొని ఎన్నో అపాయాలను దాటి బ్రతుకు జీవుడా అని ఇవ్వాళటికి ఈ గండాలన్ని తప్పినవనే సంతృప్తితో బావుల నుండి బయటికివస్తున్న కార్మికులు లేరు. తను చేయబోయే కష్టాన్ని తలచుకుంటూ మరువలేని ఘోరాతి ఘోరమైన ప్రమాద సంఘటనలు జ్ఞప్తికి రాగానే గగుర్పాటుతో ఒళ్ళువణుకుతుంటె పెండ్లాం పిల్లలను తలుచుకుంటు కొండంత భారంతో నడుస్తూ....

---

అనకుండా పొరుగూళ్ళ జనం వస్తున్నారు ఆ బహిరంగసభకి. జనసమూహం మధ్య లోంచి.... సన్నగా దారి కన్పిస్తోంది 'పాపిడ'లా, ఆదారిలోంచే బండి వెళ్ళాలి. తలు. కుంటుంటె ఆపాట వింటుంటె ప్రతాపరావు దొర దవడలు బిగుసుకుపోతున్నయ్. జన సమూహం మధ్యలోంచి ఎఱ్ఱని జండా రెపరెపలాడ్తోంది. ఎవరో వీపుకి కోతలు పెట్టి కారం అద్దినట్టు ఇదైపోతున్నాడు. బండి అలాగే నిలబడిఉంది. దొరగారి మనసులో కొద్దిగా అనుమానం. కొద్ది దూరంలోఉన్న తాటిచెట్లలోంచి కావడి బుజాన వేసుకుని వస్తున్నాడొక గౌడు. బండి దగ్గరికి రానేవచ్చాడు.

"ఏంరా గౌడు ! అక్కడజరిగేది ఏం మీటింగు ?" అంటూప్రశ్నించాడు.

"సంఘపోల్లది"అంటూ వెళ్ళిపోయాడుగౌడు. దొరగారు దారికిఇరువైపుల చూశాడు, పక్కదారులు కన్పించలేదు- అంతటా పచ్చనివరిపొలాలె. బండెనుక మనిషితో, మీటింగుమధ్యలోంచిపోతె ?" తల అడ్డంగాఊపుకున్నాడు- ఓమారు ఓదెల్ను, ఓమారు జనసమూహాన్ని రెపరెపలాడె ఎఱ్ఱజండానిచూసి నిట్టూర్చాడు.

"అరేయ్ ఎనుకబండెక్కు తొందరగపోవాలె" అన్నాడు ఓదెలు నమ్మలేనట్టు చూశాడు,

"ఎక్కరాగాడిదీ- ఎక్కు, ఎక్కుమంటె చెవులు ఇనవడ్తలేవ్ !" కోపంగా అన్నాడుదొర.

భయంగా బండెక్కి వెనుక ఒదిగికూర్చున్నాడు ఓదెలు. కోపంగాఉన్న ప్రతాపరావుదొర. రెండుగిత్తల్ని రెండుదెబ్బలు కసిగాకొట్టాడు, బండిమళ్ళీ 'సవారీ' మొదలెట్టింది.

బాయి దొర యాదికిరాగానే, ఐదునిమిషాలు ఆలస్యమైందని నాగపెడ్తాడన్న భయంతో అదర బాదరగా డ్యూటీకి వస్తున్న కార్మికులూ లేరు. దొరలు (మేనేజర్లు, అండర్ మేనేజర్లు, ఓవర్‌మెన్‌లు) కార్మికులను ఏదో నెపంతో తిట్టేటి తిట్లూలేవు. దొరలూ లేరు దొరల జులుంలేదు దొరల జులుంను కాపాడడానికి ఎత్తులువేసే సక్కాజిత్తుల ట్రేడ్‌యూనియన్ నాయకులూ లేరు. అలర్‌ల చప్పుడూలేదు, యంత్రాల రొదా లేదు.

బావి మీద ఎటు చూసినా అల్లంత దూరం వరకు ఉండే గుట్టల్లాంటి బొగ్గు కుప్పలు లేవు. బుల్‌డోజర్‌తో ఊడ్చుకపోయి ఆనేలంతా జగిలి చేసినట్లుగా నున్నగా ఉంది. బొగ్గును తీసుకపోయే లారీల బుయ్ బుయ్ శబ్దం లేదు. రకరకాల యంత్రాల రణగొణధ్వనుల్లేవు. కార్మికుల అరపులు లేవు, దొరల కేకలులేవు. మొత్తం ఉప్పెన వచ్చి ఊడ్చుక పోయినట్లుగా శ్మశానంలా ఉంది. శ్మశానంలోని కాటికాపరుల్లాగా వాచ్‌మెన్లు మాత్రం అక్కడ తిరుగుతున్నారు.

సైరన్ కూత వినీవిననట్లు నిర్లిప్తంగా ఉన్నాయి కార్మికవాడలన్నీ. ఉదయమే ఊరంత కాల్తున్నట్లు బొగ్గుపొయ్యిల నుండి వెలువడే పొగలేదు. కార్మిక స్త్రీలందరు అప్పుడే ఒక్కొక్కరు లేచి ఏదో తెలియని బాధతో మనస్సు భారంగా ఇంటిపనులకు ఉపక్రమిస్తున్నారు. ట్రేడ్‌యూనియన్ నాయకుల కుట్రలచే తమ శక్తి ఏమిటో తెలుసుకోలేక పోయిన కార్మికులు అనివార్యంగా పద్మవ్యూహంలోకి పోయిన అభిమన్యునిలా ఎన్నో అర్థంకాని సమస్యలతో నిద్రపట్టక మగత నిద్రనుండి లేచి ఒక్కొక్కరే బయటికివస్తున్నారు.

తూర్పున సూర్యుడు ఉదయించాడు. కాలిపోతున్నకొద్ది మరింత బొగ్గునుచేర్చుతే చిటపటకాలుతూ ఇంజనును ఉరికించే రైలు ఇంజనులోని ఎర్రగా మండే మంటలా లేడు. బొగ్గుఒడిసిపోయి ఉన్నవేడితో కుంటుకుంటూ నడుస్తున్న రైలు ఇంజనులోని బూడిదకాబోతున్న అగ్నిలా కాంతి విహీనంగా ఉన్నాడు. బయటికి వచ్చిన కార్మికులకు బస్తీలోని పాన్‌డేలాకు అంటించిన ఎర్రటి అక్షరాల కాగితం కొట్టొచ్చినట్లుగా అందరి దృష్టిలో పడ్డది.

"నాలురోజుల కోసారి అంటేత్తాండ్లు రాడికలోల్లయో కదా? ఏమి రాసింద్లో చదువుదువ పా" నోట్లోవున్న పండ్లపుల్లను చేతిలబట్టుకోని వెంకటయ్యను అడిగింది రాములు.

"వాల్లుగాకపోతే కార్మికుల కోసం కాగితాలు ఇంకెవ్వడేత్తడే?" వాల్‌పోస్టర్ను చదవకముందే కచ్చితంగా చెప్పిండు వెంకటయ్య

"వాళ్లేఎత్తరని నాకెఱుకేగని నదువుతువు పోరాదు; రాములు, నారాయణ కలిసి చేలకాడికిపోయే సరికి ఇంకొందరు జమయిండ్లు అక్కడ.

☆ "రామకిష్టాపురం 1వ ఇంక్లయిన్ బావివద్ద కార్మికులపై పోలీసుల లాఠీ చార్జీని ఖండించండి।

☆ అరెస్టు చేసిన కార్మికులను వెంటనే విడుదల చేయాలి।" అని కార్మికుడొగడు గట్టిగా చదివిండు.

"వీనవ్వ మా బాయికాడ ఎప్పుడు కాగితాలు అంటించినా గూడ గాద్దికొడుకులు పీకేపిత్తాండ్లు. అయినా వీల్లను ఎక్కడ కనిపించినా పోలీసోల్లు పట్టుకపోతాండ్లు కదా? మరి ఇవ్వెప్పుడంటింతాండ్లో?" ఆశ్చర్యపోతూ అడిగిండు అశాలు.

"ఆదరాక పందిరి కురుసున్నదన్నట్లు మంది గురించి పాటుపడుదామనేటోల్లకు మార్గమేకరువా? అయినా నాకు తెలువ కదుగతా, అందరు గట్టిగనే మాట్లాడుతె, అందరం కట్టుగనేపుంటే ఎందర్నని పట్టుకపోతరు?" వెంకటయ్య ఇంకేదో చెప్పబోదా మనుకునేటాల్లకు కలిగించుకొని.

"ఏం మాట్లాడుదోఏమో? ఎవడు గట్టిగమాట్లాడుతె వాన్నే రాడికల్ అనబట్రి, రాత్రికిరాత్రే పట్టుకపోబట్రి. ఇగ ముంగటబడి ఎవడు మాట్లాడుతడు. గా కొత్తగూడెం కుమారయ్య సారేమో ఈ చట్టం సమ్మెచేస్తెపోదు, మేం కోర్టులో కేసుపెడుతున్నాం మీరు పనులల్లకు దిగిపోండని అనబట్టె, మనకేమో ఏది తెలువనాయె, మనం ఎవన్నిబట్టుకోని నడుసుడేనారన్నా?" అడిగిండు 35 ఏండ్ల చెంద్రియ్య.

"ఏమోరా కుమారయ్య సారేమో గట్లంటడు, గా రాడికలోల్లు మొన్నటిదాకా బాయిలమీదికచ్చి మనం గట్టిగుండాలె, మనం తప్పకుండగెలుస్తాం, ఈ చట్టం ఉంటె ఇక నుండి మనం సమ్మెచేయలేం, మన హక్కులు రావాలంటె సమ్మెగదా మన ఆయుధం అని చెప్పిరి ఇప్పుడు పోలీసోల్లు వాల్ల గురించి తిరుగుతాంటె వాల్లెటుటోయిండ్లో ఏమో;" ఈ ట్రేడ్‌యూనియనోల్ల, రాడికలోల్ల రాజకీయాలు అర్థంకాక అన్నడు బక్కయ్య.

"నీయవ్వ....రాడికలోల్లని మెడలేమన్న బోర్డుగట్టి ఉంటానాదిర? ఉన్నదున్నట్లు ఎవడడిగినా రాడికలేనాయె, న్యాయం గురించి మాట్లాడినోడల్లా నక్సలైటేనాయె, ఎవడో ఏమో అంటడని అందరం నోరుమూసుకోనే ఉందామా? ఎవలు గూడ బాయిలకాడ కనిపిత్తలేరంటె ఏమి గనపడమన్నవ్ నువ్వే అనబడ్తివి బాయిల మీదికి వస్తేనేపట్టుక

పోతాండ్లని గా నిన్నటి సంగతే సూరాత్రిదు.... యూనియనోల్లు పోలీసుల పెట్టుకోని రామకిష్టాపురం వన్ యింక్లయిన్ బాయిని నడిపించడానికి ఏషంగట్టిరి. గా సంగతి తెలిసి మిగితా బాయిలోల్లందరు అక్కడి కచ్చేటాల్లకేముంది వీన్ని వాన్ని అనకుండ పోలీసోల్లు కట్టెలబట్టి ఇట్టంవచ్చినట్లు కొట్టిరి. మందమర్రి బాయిలు నడుత్తావయని రామకిష్టపురమోల్లకు జెప్పిరి, అక్కడి బాయిలు నడుత్తానయని ఇక్కడి బాయిలోల్లకు చెప్పవట్టిరి లీడర్లు. ఇగ ఎవల్ని నమ్మాల్నో తెలుత్తలేదా।" వెంకటయ్య చెప్పే మాటలకు అడ్డం ఎవడూ ఏమిమాట్లాడక ఎవరికి తోచినట్లు వాల్లు యూనియనోల్లను, పోలీసోల్లను తిడుతాండ్లు.

"మరి ఇట్ల ఇంకెన్నిరోజులే మనం సమ్మెచేసేది ఇప్పటికే 45 రోజులు గాబట్టె" అర్థంగాక అడిగిండు రాములు.

"నీయవ్వ ఏదైనామంచిదే అటోఇటో తేలేదాక గట్టిగుండాలె" 50 ఏండ్ల కొమురయ్య తన 20 ఏండ్లసర్వీసులో తేలిననిర్ణయంగా అన్నాడు.

"మొన్నటినుండి గోదావరిఖనిలోగూడ అన్నిబాయిలోల్లు సమ్మెచేత్తాండ్లట గదా!" అడిగిండు ఓకార్మికుడు.

"అవును అక్కడగూడ మనకు మద్దతుగా ఈ నష్టంపోవాలని సమ్మెచేత్తాండ్లు" వేరేకార్మికుని జవాబు.

"నీయవ్వ.... గింతమందిమి చేయబడితిమి ఇంక ఎటుతేలుతలేదు, ఇది దేల్తదా? తేలదా? ఇప్పటికే అప్పులపాలయినం."

ఇలాసాగుతాంది చర్చంతా........

ఇంతలో ఎవరోయువకుడు చేతిలో పేపరుపట్టుకొని: తనగాండీవంతో ఈ కాలగమనాన్నే ఆపేశక్తిగల అర్జునునిలా విజయగర్వంతో దారిలోకనబడ్డ ప్రతి వాల్లకు ఏదోచెప్పుకుంట వస్తున్నాడు.

దూరంలోఉండగానే.... "ఏమన్నరాసిండ్లారా మనగురించి" అని అడిగిండు వెంకటయ్య.

"ఆ(రాసిండ్లు"

దగ్గరకువచ్చి పేపరువిప్పి "సింగరేణి కార్మికుల సమ్మెవల్ల 222 రైళ్ళురద్దు" "ఇది తీవ్రవాదులచిచ్చు" అని తాటికాయంత అక్షరాలను గడగడచదివిండు.

"అబ్బా గన్నిరైళ్ళు ఆగిపోయినవా" తనబలాన్నితానే నమ్మలేనిమల్లన్న ఆశ్చర్యంగా అన్నాడు. అందరిముఖాల్లో ఏదో తెలియనిఆనందం, సంతృప్తి.

"ఇంకేంరాసిండ్లురా" యుద్ధంలో గెలిసివచ్చినవాండ్లను అడిగినట్లుగా అడిగిండు రామన్న.

తిరిగి ఆ యువకుడు చదవడం మొదలుపెట్టిండు, అందరు ఏదో కొత్తవిష యాలు తెలుసుకుంటున్నట్లుగా ఉత్సాహంగా, ఆశ్చర్యంగా ,వింతగావింటుండ్లు- "ఇంకా కొద్దిరోజులలో 300 రైళ్ళు రద్దుఅయ్యే అవకాశాలు ఉన్నాయి. అనేక ఫాక్టరీలు మూతపడేటట్లున్నాయి. ఇప్పటికే పవర్‌స్టేషనులు సగం ఆగిపోయినవి" మొసవచ్చినట్టుంది. ఆగాడు....

మళ్లీ మొదలుపెట్టిండు "ఇది తీవ్రవాదులచర్య - రాడికల్స్ లేనివిపోనివి కల్పించి కార్మికులను అనవసరంగా రెచ్చగొట్టి సమ్మెలోదించారు- అంతేగాని కార్మికులకు ఏమి సమస్యలులేవు- సమ్మెచేస్తున్న కార్మికుల సమస్యలేమిటో వారి ప్రతినిధులు ఎవరో నాకేమితెలియదంటూ ముఖ్యమంత్రి అన్నారు."

"ఏందేంది మనకేమి సమస్యల్లేవా?" అని ఎవరో అనడంతో చదువడంఆపి ...

"ఆఁ అప్పనే మనకేమి సమస్యలులేవట, ఇంకేమంటదోతెలుసా అసలు మస్టర్ల కోత చట్టమేలేదు రాడికల్స్ రెచ్చగొట్టుతెనే సమ్మెచేస్తానమట" అన్నాడు పేపర్ యువకుడు.

"నీయవ్వ ఇదంతా మనలమోసంచెయ్యాలని చూస్తాండ్లు- వాడు యూనియ నోడేమో ఈ చట్టమేపోదు అంటడు- ముఖ్యమంత్రేమో అసలు మస్టర్లకోతపెట్టుట లేదంటడు. ఇక్కడ మేనేజిమెంటోడేమో జీతాలుకొయ్యబట్టె ఇవన్ని లఫంగి పేశాలున్నట్లున్నయి" కోపాన్ని వెల్లబోసిండు సుధాకర్.

"ఇగో ఇంకోటినుండ్లి"; చదువడం మొదలు పెట్టిండు పేపర్ యువకుడు.

"ఉన్నరైల్లు, ఫ్యాక్టరీలు నడవడానికి ప్రభుత్వం కలకత్తా నుండి 10 లక్షల టన్నుల బొగ్గుకొనుగోలు చేసింది. అయితే బొగ్గుతేవలసిన ఓడ విశాఖపట్నం రేవులో దిగాల్సివుండగా కొలంబోకు పోయింది. ఆ ఓడ కొలంబోకు ఎట్లాపోయిందో తెలి యదు. దాని గురించి తెలుసుకోవడానికి ప్రభుత్వం చర్యలు తీసుకుంటోంది" చదువడం ఆపిండు.

"ఇది కూడ రాడికలోల్లే ఎత్తుకపోయిండ్లనలేదు నయ్యం"; అన్నడు వెంకటయ్య

"అంటే అంటరు గూడ ఈ దగుల్బాజి నాకొడుకుల నోట్లె ఉన్నది నాలుకయితె గదా !" కసిగా అన్నాడు ఇంకో కార్మికుడు.

పరిస్థితి అంతా యుద్ధంలో గెలుస్తున్న పక్షంవాళ్ల ఎన్ని ప్రాణాలు పోగొట్టుకున్నా, ఎన్ని నష్టాలకు గురైనా గెలుస్తున్నయన్న ఉత్సాహంలో మాట్లాడుకుంటున్నట్లుగా ఉంది.

పొద్దు వారెడెక్కింది. ఒక్కొక్కరు ఇండ్లల్లకు మెల్లమెల్లగా ఎల్లిపోతాండ్లు.

"ఈ రోజు సాయంత్రం 7 గంటలకు మార్కెట్టులో బహిరంగసభ- ఈ సభలో కార్మికుల సమస్యల గురించి మన ఎర్రజెండా యూనియన్ నాయకులు మాట్లాడెదరు" అంటూ తాగిన వాడిలా బొంగురు గొంతుతో ఎవరో మైక్‌లో చెప్పుకుంట పోతాండు.

X X X X

సాయంత్రం ఆరున్నర కావస్తుంది. గుంపులు గుంపులుగా కార్మికులు బహిరంగసభాస్థలానికి చేరుకుంటాండ్లు. అక్కడ ఓ పెద్ద మైదానంలో ఓ బల్ల- ఆబల్ల పైన నిలువుగా మౌత్‌పీస్ అమర్చబడి ఉంది- వచ్చిన కార్మికులు గుంపులు గుంపులుగా జమగూడి మాట్లాడుకుంటాండ్లు- కొంత మంది ఎర్రచొక్కాలు తొడుక్కున్నవారు కర్రలు చేతబట్టుకొని తాగినోనితీర్గ ఊగుతూ అందరిని కూర్చోండి, కూర్చోండని మొత్తుకుంటాండ్లు.

ఆ సమయంలో దిద్దిన ఎరుపుతో రెపరెపలాడుతున్న ఎర్రజెండా ముందుపెట్టుకొని ఒక తెల్లనికారు దుమ్ము నులేపుతువచ్చి ఆగింది- రేగిన దుమ్మును దులుపుకుంటూ కసిగా సూసిండ్లు కార్మికులు- కారు వెనుకనే రెండు, మూడు వ్యాన్లువచ్చి స్టేజీవద్ద ఒకటి దూరంగా అటోకటి, ఇటొకటి ఆగినవి దాంట్లోంచి సాయుధులైన కాకిబట్టలు కాని ఎరుపును కాపాడడానికి దిగాయి.

మైక్‌లో ఒకతను "కార్మిక సోదరులారా ఇప్పుడు సభ ప్రారంభమవుతుంది. మొదట కామ్రేడ్ కుమారయ్యగారు మాట్లాడుతారు- కా॥ కుమారయ్యగారు ఇప్పుడు ఈ రాడికలోల్లు చేస్తున్న పోరాటంకన్న రెండింతల పోరాటం చేసిండు- తుపాకినే భుజాన వేసుకొని ఈ అడవుల్లో తిరిగిండు- నిజాం సర్కారును గడగడ లాడించాడు- అటువంటి కుమారయ్యగారు ఇప్పుడు మీ ముందు మాట్లాడుతాడు."

"మా సచ్చిపోయిన బర్రె పగిలిపోయిన బుడ్డెడు పాలిచ్చిందట": గట్టిగనే అన్నరెవరో గుంపులనుండి- అహా... హా....హా.... జనంలో నవ్వులు.

మళ్లీ తిరిగి ఆయనే రేషమెచ్చిన వాడిలా "కార్మిక సోదరులారా ఈ సభను చెడగొట్టాలని కొంతమంది దుండగులు ప్రయత్నిస్తున్నారు"

"పచ్చకామెర్లోనికి లోకమంత పచ్చగనే కనపడుతదట" మెల్లగా అన్నారెవరో వెనుకనుండి

బొంగురుగొంతు నాయకుడు కళ్ళకున్న అద్దాలుతీసి చేతపట్టుకొని హూ- హూ- అని సవరించుకొని "కార్మికసోదరులారా ! మన ఎర్రజెండా యూనియన్ నాయకత్వాన 30 పైసలున్న జీతం 30 రూపాలదాక పెంచుకున్నాం- ఇంకా ఎన్నోహక్కులు సాధించుకున్నాం- మొదటినుంచీ మన యూనియన్ కార్మికులకెంతో సేవచేసుకుంటా వస్తాంది. కాని ఈమధ్య కొంతమంది యూనియన్‌ను దెబ్బగొట్టాలని చూస్తాండ్లు- అందుకే చీటికిమాటికి కార్మికులను రెచ్చగొట్టి సమ్మెలు చేపిస్తున్నారు- గోరుతో పోయేవాటిని గొడ్డలిదాకా తీసుకపోతున్నారు- 82లో కార్మికులు సమ్మెచేస్తే 8 మస్టర్లు కోతపెట్టింది మేనేజిమెంటు- దాన్ని చర్చించి సాధించుకోవచ్చు- మేం బెల్లంపల్లిలో, గోదావరిఖనిలో ఎన్నోసార్లు సాంధిచాం- కాని కొంతమంది చట్టాలు తెలియనివాళ్లు అనవసరంగా కార్మికులను రెచ్చగొట్టి మందమర్రి, రామకృష్ణాపురం, గోదావరిఖని డివిజన్లను మొత్తం బందుపెట్టించారు- మేనేజిమెంటు జీతాలు కోస్తూనే వుంది, మేంచర్చించి సాధించుకనేఉన్నాం. ఇంతదానికి ఇంతపెద్దసమ్మె అనవసరం."

"అయ్యా ఇదేమన్నా బావబామ్మర్దుల సయ్యాటలా వాడుపెట్ట, మీరుతియ్య, లేకుంటె మేంఏమన్న అడుక్కతింటున్నమా ?! తాపతాపకు జీతాలుకోస్తంఅని బెదిరిస్తున్నారు" అని ఎవరో లేచిఅడిగిండు.

పాపం గొంతులో వెలక్కాయపడ్డట్టు అయింది నాయకుడికి.

గుటికిల్లుమింగి సర్దుకొని "కార్మిక సోదరులారా అదే మేంఅంటున్నాం- మేనేజిమెంటుకు జీతాలుకోసే అధికారంలేదు- దానిగురించి మనం పెద్దపోరాటం చేయాల్సివుంది అయితే ఇది ఒక్క మనంచేస్తేనేపోదు- దేశంలోఉన్న కార్మికులందరు చేస్తేగాని ఈచట్టంపోదు అందుకని మనం ఓపికపట్టాలి- ఇపుడు పరిస్థితి మంచిగ లేదు కాబట్టి కార్మికులారా ! లెనిన్ మహాశయుడు ఏమన్నాడోతెలుసా ? "ఒక్కడుగు ముందుకు రెండడుగులు వెనక్కు" వేయమన్నాడు.

"నువ్ ఎప్పుడు చెప్పినా ఒక్కడుగు ముందుకు రెండడుగులు ఎనుకకే ఎయ్యమంటి ఇగ ముందుకు పొయ్యేదెప్పుడు-"; అన్నరెవడో గట్టిగ

"అహ్హా....హా....హా.... జనంలో నవ్వులు

"మీ అందరికి రాడికలోల్లు బాగనూరిపోసారయ్యా మీరంత నక్సల్లు": కోపం వచ్చిన నాయకుడు అక్కసుతో గట్టిగా అన్నడు.

"లేకుంటె నీలెక్క మేనేజిమెంటు బూట్లు....

పూర్తిగాకముందే ఎర్రిచొక్కాలవాళ్లు, కాకీబట్టలవాళ్లు గల్లపట్టుకున్నారు. "విడవండి" వేలాది గొంతులు ఒక్కసారి పలికాయి. ఎవడిదో గొంతుక్రిక్కగొంతోడు "మారో మాకెలొదోంకో" మొత్తుకున్నాడు అంతే.... పటపట కర్రిలు టపటపరాళ్లు ఉరుకులు.... పరుగులు.... నిమిషంలో నిర్మానుష్యం.

కారు, వ్యాన్లు పోలీస్టేషన్ ముందు ఆగినయి. ఫోన్ మ్రోగింది. ఆరాత్రి జనరల్ మేనేజర్ ఇంటికి పోలీస్టేషన్కు ఏవో గుసగుసలు సాగాయి.

X X X X

ఉదయం 8 గంటలు కావస్తుంది....

సింగరేణి కాలరీస్ జనరల్ మేనేజర్ ఆఫీస్అని పెద్దబోర్డున్న బిల్డింగ్ముందు ఎర్రిజండాముందున్న తెల్లకారు, మూడురంగులజండా ముందున్న పచ్చకారు ఇంకా వేరేకార్లు, పోలీస్వ్యాన్లు, జీపులువచ్చి ఆగినయ్....

ఏర్ కండీషన్గదిలో ఏవో మంతనాలుసాగాయి.

X X X X

పోలీస్టేషన్లోని ఫోను గణగణగణ మ్రోగింది. "యెస్ యస్. ఐ ప్లీజ్" అన్నాడు యస్. ఐ గారు. అవతలిగొంతు వినగానే లేచినిలబడి ఫోనులోకి సెల్యూట్ చేసినట్లు వినబడేలాగ కాలును నేలకేసికొట్టి సెల్యూట్ చేసాడు.

"ఎంత వరకు వచ్చింది. కార్మికులు డ్యూటీకిపోతున్నారా ? లేదా ?"; అవతలిగొంతు.

"లేదుసార్ ఈ రాడికల్స్ను అందరిని అరెస్టుచేస్తేగాని సమ్మె విరమింపబడేట్లు లేదుసార్. మేనేజిమెంటు యూనియన్లు 300 మంది పేర్లు యిచ్చినయిసార్, వారిని ఈ రోజురాత్రి పట్టుకోవాలనుకుంటున్నాం సార్"; అన్నాడు.

"సరే తొందరగా కానివ్వండి"; అని ఆర్డర్ఇచ్చింది అవతలిగొంతు.

X X X X

చీకటిపడింది. కన్నుపొడుచుకున్నా కనపడని చిమ్మని చీకటి. ఆ చీకటిని చీల్చుకుంటు మిణుగురు పురుగులాంటి కొంతమంది యువకులు ఓ గుడిసెలోకి చేరుకున్నారు.... వారురాగానే చాపలువేసింది ఆ ఇంటిఆవిడ.... గుడ్డిదీపం మధ్యలో ఓ డబ్బపీద పెట్టుకోని అందరు గుండ్రింగా కూర్చున్నారు. వారిలో చాలమంది యువకులే వారిముఖాల్లో ఏదోఆందోళన, ఉత్సాహం, పట్టుదల మిశితమైఉన్నట్టుగా కనపడుతున్నాయి.

"కామ్రేడ్ టైంలేదు మనం తొందరగా వెళ్లిపోవాలి మొదలుపెడ్తాం" అన్నాడు.

అందులో ఒక వ్యక్తి.... "కామ్రేడ్ ఈ మన సమ్మెను విచ్ఛిన్నం చేయడానికి ట్రేడ్ యూనియన్ నాయకులు, మేనేజిమెంటు, ప్రభుత్వం కుట్రలు పన్నుతున్నాయి ఇన్ని రోజులు మాటతో మనల మోసపుచ్చి సమ్మెను విచ్ఛిన్నం చేయాలని చూసారు. కాని ఈ దగుల్బాజి ట్రేడ్ యూనియన్ నాయకులు మేనేజిమెంటుకు అమ్ముడుపోయే విధానాలను అర్థంచేసుకున్న కార్మికవర్గం అంతా వారి మోసాలకు తల ఒగ్గలేదు- అయితే ఇప్పుడు అరెస్టుల ద్వారా సమ్మెను విచ్ఛిన్నం చేయాలని కుట్రలు పన్ను తున్నారు- ట్రేడ్ యూనియన్ నాయకులు, మేనేజిమెంటు 300 మంది కార్మికుల పేర్లు పోలీసులకిచ్చారట, బహుశ ఈ రాత్రినుండి ఇండ్లమీద దాడులు మొదలుపెట్టవచ్చు- అయిన మనమంతా జాగ్రత్తగా ఉండి కార్మికులకు వీరికుట్రలను తెలుపుతూ సమ్మెను కొనసాగించాలి- మనందరం కార్మికులమే గనుక ఇంటింటికి తిరిగి కార్మికులనంద రిని కలిసి చెప్పాలి." ఇలా చాల వివరాలు మాట్లాడుతున్నారు- వెళేముందు అందరూ ఒకరి నొకరు చెయ్యెత్తి పిడికిలి బిగించి ఎర్రెర్రదండాలు తెలుపుకొని ఒక్కొక్కరే చీకట్లో కలిసిపోయారు.

X X X X

పోలీస్ స్టేషన్‌లో ఉన్న పాతగడియారం టన్- టన్- టన్-మని పన్నెండు సార్లు మ్రోగింది.... రెండు వ్యాన్లనిండా పోలీసులు, తెల్లబట్టలువేసుకున్న వాడెవడో కూర్చుని ఉన్నారు.

"స్టార్ట్...." అన్నాడు సి.ఐ. ముందు జీపులో ఉన్న తెల్లబట్టలవాడు దారిచూపు తుండగా కదిలినయ్....

"ఇక్కడే సార్ రంగని ఇల్లు" అన్నాడు తెల్లబట్టల తొత్తుగాడు.

అన్నీఆగినవి- అందరుదిగి టక్- టక్-మని బూట్లచప్పుళ్ళతో ఒక గుడిసె చుట్టూ నిలబడ్డారు....

"రంగన్నా.... రంగన్నా" అని మార్చినగొంతుతో పిలిచాడో పోలీసు.

మళ్ళీపిలిచాడు-

"ఎవరు" అంది లోపలినుండి ఆడగొంతు.

"నేను ఆయనదోస్తును" అన్నాడు అదేపోలీసు-

"లేడు" అంది ఆమె

"ఎటుపోయిండు"....

"ఏమోతెలియదు"....

"తలుపులు తియ్యి"

"ఎందుకు ? ఎవరునువ్వు? " ఆందోళనగా దాదాపు మొత్తుకున్నట్లుగా అంది.

"ఏయ్ మేము పోలీసోల్లము సర్కిల్‌సాబ్ వచ్చిండు తలుపుతీయ్"

"ఓ అన్నయ్యా, ఓ అన్నయ్యా" ప్రక్కింటికార్మికున్ని పిలిచింది.

"ఆఁ ఆఁ" అంటూ ప్రక్కింటి కార్మికుడు లేచివచ్చాడు.

దాదాపు చుట్టు ప్రక్కల ఇండ్లల్లోఉన్న కార్మికులు, స్త్రీలు లేచి ఒక్కొక్కరు బయటికి వస్తున్నారు.

"ఎవరయ్యా" అంటు ఓ కార్మికుడు వచ్చిండు.

"ఏయ్ నువ్ ఏ బాయికి పనిచేత్తనవ్" యస్. ఐ.

"కెకె2 సార్" కార్మికుడు జవాబు

"రంగన్న ఏడి"; యస్. ఐ

"ఏమో"; కార్మికుడు.

"ఆమెను తలుపు తీయమను"; యస్. ఐ

"తలుపట తీయక్కా"; కార్మికుడు.

"ఎందుకట ఇంట్ల ఎవరు లేరు" ఇంటామె.

"ఏయ్ తలుపుతీయ్" అని ఒక్కతన్ను తన్నాడు తలుపును యస్. ఐ.

తలుపు తెరుచుకుంది.... ఇల్లంతా గాలించారు ఇంట్లో ఎవరూ మొగవాళ్లు లేక పోయేసరికి ఏవేవో బూతులు తిట్టిండ్లు....

"అరేయ్ వాన్ని బట్టుకోండి వాందికూడ కెకె2 బాయేనట"; అన్నాడు సర్కిల్ ఇనస్పెక్టర్.

కార్మికుడు ఉరుకబోయాడు కాని వీపుమీదపడ్డ లాఠీదెబ్బకు అమ్మాఅన్నాడు.... అంతే వ్యాన్లో ఎక్కించారు.

ఇలా రాత్రింతా కార్మిక వాడల మీద దాడులు జరిగాయి.... బూతులు.... దెబ్బలు.... అరెస్టులు.... ఊరు ఊరంతా లేచింది....కార్మికులతిట్లు, స్త్రీల శాపనార్థాలు.

అంతా.... గజ దొంగల ముఠా ఊరిమీదపడి దోసుకు పోయినట్లుగా ఉంది.

తెల్లవారకముందే బావులమీద, గోడలమీద, ఊరంతా తెల్లని పేపర్లమీద ఎర్రటి అక్షరాలున్న పోస్టర్లు అతికించబడ్డాయి.

"మేనేజిమెంటు, ట్రేడ్‌యూనియన్ నాయకుల కుట్ర ఫలితంగా 20 మంది కార్మికుల అరెస్టు"

"పోలీసుల దౌర్జన్యం నశించాలి"

"అరెస్టుచేసిన కార్మికులను వెంటనే విడుదల చేయాలి." అని వ్రాసిఉంది.

## "శాంతిదూత" నెహ్రూ

1950లో అనుకోకుండా నేను భారతదేశానికి ప్రయాణం కావల్సివచ్చింది. ప్యారిస్‌లోవున్న నన్నుపిలిపించి, 'జ్యూలియట్‌క్యూరి' భారతదేశానికి నన్ను శాంతి ప్రతినిధిగా వెళ్ళమన్నారు, ఢిల్లీలో వివిధ రాజకీయ ప్రముఖుల్ని సందర్శించి, తర్వాత శాంతినిగురించి భారతదేశ అభిప్రాయాల్ని బలపరచాల్సిన అవశ్యకతను మేం గమనించాలి.

విశ్వశాంతి సంఘుఅధ్యక్షులు 'జ్యూలియట్‌క్యూరి'తోనేను సుదీర్ఘంగా మాట్లాడాను- భారతదేశం శాంతిని ప్రతిపాదించిన ప్రముఖ దేశమనిపించినా, నిజానికి శాంతిపట్ల ఆ దేశంలో దీనికి ఎక్కువవిలువ లభించడం లేదని తెలిసినక్యూరి ఆ విషయాన్ని నాతో సంప్రదించారు- అప్పటి భారతప్రధాని పండిత జవహర్లాల్ నెహ్రూ శాంతి ప్రతిపాదకులు.

జూలియట్‌క్యూరి నాకు రెండుత్తరాలు యిచ్చారు. ఒకటి బొంబాయిలోని ఒక శాస్త్రజ్ఞునికి, మరొకటి భారత ప్రధానికి అందజేయాలి- ఇంత చిన్నపనికి నన్ను కోరడంపట్ల నేను చాల ఆశ్చర్యపోయాను, యవ్వనంలో కొద్దికాలం భారతదేశంలో వుండి ఆదేశంపట్ల నేను పెంచుకొన్న గౌరవంవల్లో లేక పాబ్లో పికాసో, నజీం హిక్‌మత్‌లతోపాటు నేనుపొందిన శాంతి బహుమతివల్లో భారతదేశం వెళ్ళగలిగేభాగ్యం నాకు లభించింది.

నేను బొంబాయివెళ్ళే విమానంఎక్కాను- 30 ఏళ్ళతర్వాత నేను మరోసారి భారతదేశానికి వెళ్తున్నాను. 1928లో స్వతంత్ర భారతదేశాన్ని కలలుకన్న గాంధీ సత్యాగ్రహోద్యమాల కాలంలోజరిగిన కాంగ్రెస్ సదస్సుకు నేను హాజరయ్యాను. ఆనాటి వారికలలు నేటికి నిజమయ్యాయి ఆనాటి నా పాతమిత్రులు బహుశః యిప్పుడు జీవించివుండరు.

బొంబాయి విమానాశ్రయంలో దిగినవెంటనే కస్టమ్స్ అధికారులవద్దకు నడిచాను- అచట పనిపూర్తిచేసుకొని, ఓ హోటల్‌కువెళ్ళి, తర్వాత భౌతికశాస్త్రజ్ఞులు రామన్ గారికి వుత్తరాన్ని అందించి, ఢిల్లీ బయల్దేరాలని నావూహ- నాకు స్వాగతం పలకడానికి ఎవరైనా వచ్చివుంటారని నేను వూహించలేదు. నాదృష్టి నాచుట్టునిలబడిన పలువురు కస్టమ్స్ అధికారులపై కేంద్రీకృతమైంది. వారు నేనుతెచ్చిన వస్తువులు పరీక్షించడంలో నిమగ్నులైనారు- ఇటువంటి పరీక్షావిధానం యింతకుముందు నాకెప్పటా అనుభవంలోలేదు. నావస్తువులేవీ పెద్ద విలువగలవికావు- మధ్యసైజు

సూట్‌కేసులో కొన్నిదుస్తులు, చిన్న తోలుసంచిలో షేవింగ్‌సెట్‌లాంటి కొన్ని వస్తువులను తెచ్చుకొన్నాను- ఐదుగురు కస్టమ్సుఅధికార్లు నప్యాంటుల్ని, షర్టుల్ని, బూట్లను తిప్పి, తిప్పి, దులిపిచూచారు- నాజేబుల్ని, మిగతభాగాల్ని నిశితంగా పరిశీలించారు- సూట్‌కేసులోని దుస్తులకు దుమ్ముఅంటకుండా రోమ్ హోటల్‌లో ఓ పాతపత్రికవుంటే దాన్లో నాబూట్లు చుట్టిపెట్టాను- అధికార్లు ఆ పాతపత్రికను బల్లపై పరచి, దాన్నో రహస్యపత్రంలా భావించి పరీక్షించసాగారు- దాన్ని జాగ్రత్తగాచుట్టి నా యితర సామాన్లతోబాటు వుంచారు. తర్వాత నా జోళ్ళను పరిశీలించారు.

వారి సంశయాత్మకమైన పరిశోధన రెండు గంటలపాటు జరిగింది. తర్వాత నా పాస్‌పోర్టు, వుత్తరాలు, పాతపత్రిక, అన్నీ కలిపి ఓ పెద్ద పొట్లంకట్టి నా ఎదుటే దాన్ని సీలుచేసి, తమ వద్ద వుంచుకొన్నారు. తర్వాత హోటల్‌కు వెళ్ళడానికి నన్ను మతించారు.

ఎట్టి పరిస్థితిలోనూ సహనం కోల్పోరాదన్న చిలీదేశపు సామెత మనసులో మెదలడంతో ఓర్పువహించాను- గుర్తింపు పత్రాలుకానీ, వుత్తరాలుకానీ లేకుండా విదేశీయులకు ఏ హోటల్‌లో బసయిస్తారని నేనాలోచించసాగాను.

"హోటల్‌లో మీకు ప్రవేశమివ్వాల్సిందిగా మేం తెలియజేస్తాం; మీ ఈ ఉత్తరాలు, మిగత సామాన్లు నెమ్మదిగా మీకుపంపుతాం" అంటూ కస్టమ్స అధికార్లునాతో చెప్పారు.

మహత్తర స్వాతంత్ర్య పోరాటం నడిపి నావూహల్లో వున్నతస్థానాన్ని ఆక్రమించిన భారతదేశం యిదేనా అని నేను సంశయించాను. నా పెట్టెను, నోటిని ఒకే సారి మూసివేసి హోటల్‌వైపుగా నడిచాను. కస్టమ్స్ వారి హేయకృత్యంవల్ల నా మనసు చాల బాధపడింది.

హోటల్లో నేను ప్రొఫెసర్ బయెరాగారినికలిసి, జరిగిన విషయాలు వివరించాను ఆయన వుత్తమ సంస్కారం గల భారతీయుడు- జరిగిన విషయాలను అతడు చాల తేలిగ్గా తీసికొన్నాడు- దేశం ప్రగతిపథంలో యింకా బాల్యావస్థలో వున్నందున యిటువంటివి సర్వసామాన్యంగా జరుగుతాయని సర్దిచెప్పాడాయన. కానీ, నేను కొత్తగా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకొన్న దేశంలో యిటువంటి పరిస్థితుల్ని వూహించలేక పోయాను.

నేను వుత్తరాన్ని అందజేయాల్సిన బొంబాయిలోని శాస్త్రజ్ఞులు క్యూరీకి అత్యంత సన్నిహితమిత్రులు- వారు అణువిజ్ఞాన పరిశోధనా కేంద్రపు వున్నతాధికారి- వారు ఆరోజు

తమ కేంద్రాన్ని సందర్శించడానికి, ఆనాటి మధ్యాహ్నం నెహ్రూసహోదరితో విందుకు ఆహ్వానించారు. అనుకోకుండా లభించిన అదృష్టాన్ని మూరు మాట్లాడకుండా అంగీకరించాను. ఒకచోట దుడ్డుకర్రతో నెత్తినబాదేచేయి, మరోచోట పూలమాల సర్పించే హస్తం. అజగజాంతరం. మనసు స్థిమితత కోల్పోతోంది.

అణుపరిశోధనాకేంద్రం యంత్రంతో, విద్యుత్ పరికరాల్తో నిండివుంది. తెల్లదుస్తుల్లో స్త్రీ, పురుషులు చాలచురుగ్గా పనుల్లోనిమగ్నమై కనిపించారు. వారు చెప్పిన శాస్త్రీయ, వైజ్ఞానిక విషయాలు నాకుపూర్తిగా అవగాహన కాకపోయినా, వారి సంస్కారయుతమైన నడవడి నన్ను ఆకర్షించింది. దీంతో కస్టమ్స్ అధికార్లనడత నా హృదయంలోచేసిన గాయం మానసాగింది.

ఆరోజు మధ్యాహ్నం ప్రధాని (నెహ్రూ) సహోదరితో విందుకువెళ్ళాం. ఆమె పేరు నాకిప్పుడు జ్ఞాపకంలేదు. ఆమెమంచి అందగత్తె. ప్రసిద్ధ సినీనటిలా ఖరీదైన దుస్తులు, ముత్యాలుపొదిగిన బంగారునగలు ధరించింది. ధగద్ధగాయమానంగా అలంకరించబడ్డ చేతితో ఆమె భోంచేస్తున్నదృశ్యం మరీ, మరీ చూడాలనిపించేట్లుగావుంది. ఢిల్లీలో ఆమెసోదరుల్ని (నెహ్రూను), శాంతికోసం ఆరాటపడుతున్న మిత్రుల్ని చూడాలని ఆమెతో చెప్పాను. శాంతికోసం భారతీయులందరూ ఐక్యంగాఆందోళన జరపాలని తమ అభిప్రాయంగా ఆమెచెప్పారు.

అదేరోజు మధ్యాహ్నం నేను దిగిన హోటల్‌కు నా ఉత్తరాలు, మిగతకాగితాలువున్న పొట్లం తిప్పిపంపారు. దాన్ని విప్పి, పేరేసీలు వేసివుండడం నాకంటపడింది. కస్టమ్స్ అధికార్లు నా ఉత్తరాలు, కాగితాలు వాటితోపాటున్న లాండ్రీబిల్లు సమస్తం ఫోటోతీసి వుండాలి. వారు నా నోట్ పుస్తకంలోని చిరునామాదార్లను కలిసి, రకరకాలుగా వారిని ప్రశ్నించి, బాధపెట్టారని నాకు తర్వాత తెలిసింది. వారిలా ప్రశ్నించిన వారిలో నా వదినగారు (రికార్డో గైరాలెన్ పత్ని) కూడా ఒకరు. భారత దేశంలోని ఒక మారుమూల గ్రామంలో వుంటున్న ఆమె పేరు నాపుస్తకంలో కనపడ్డంతో కస్టమ్స్ అధికార్లు ఆమెను నానా యిబ్బందులకు గురిచేశారు.

నేను ఢిల్లీ వెళ్ళి అప్పటి ప్రముఖ మేధావులతోకలిసి, సమాలోచనలుజరిపాను. నేను సంప్రదించిన వారిలో రచయితలు, తాత్వికులు, హిందూ అర్చకులు, బౌద్ధ భిక్షువులు పలువురున్నారు. ప్రతివారూ పరంపరాగత శాంతి ప్రతిపాదనల్ని ఆమోదించారు. కమ్యూనిష్టులు కానీ, బౌద్ధులు కానీ, మధ్యతరగతి ప్రజలు కానీ,- ఎవరూ

శాంతి ప్రతిపాదనల్ని వ్యతిరేకించలేదు. అందరూ ముక్తకంఠంతో శాంతిని రక్షించాలనే అభిప్రాయం వ్యక్తపరిచారు. నేను వారి అభిప్రాయాలకు సంతోషించాను.

భోజనసమయానికి నామిత్రుడు, రచయిత, డాక్టరు, చిలీదేశపు రాయబారి డా॥ జుఅన్ నావద్దకొచ్చారు మాటలమధ్యలో తాము పోలీసు వున్నతాధికారితో కలిశామని, నేను (నెరూడా) యిప్పటికిరావడం, యిప్పటి నాకార్యక్రమాలు భారత ప్రభుత్వానికి చాలయిబ్బందికరంగా తయారైనాయని, అందువల్ల నేనువెంటనే నా దేశానికి తిరిగి పోవాలని ఆయన సూచించారు. హోటల్‌లాన్స్‌లో నలుగురైదుగురు మేధావులతో శాంతినిగురించి చర్చించాలని, తర్వాత ప్రధానినికలిసి క్యూరీ పంపిన ఉత్తరం వారికి అందించాలని, తర్వాత వెంటనేనేను నాదేశం వెళ్ళిపోతానని అతన్తో చెప్పాను ఈదేశపు అధికార్ల ప్రవర్తన నాకు బాధకలిగించింది. మరిన్ సహాయాన్ని కూడా నేను కోరలేదు. తానొచ్చినపని ముగియడంతో డా॥ జు అన్ మరిన్ విష్క్రమించారు.

ఆరోజు ఉదయం తమ ఆఫీసులో కలవాల్సిందిగా నాకు ప్రధాని నెహ్రూనుండి అనుమతి లభించింది. స్వాగతంపలికే దరహాసపు ఛాయలుకూడా నెహ్రూముఖంలో కనిపించలేదు. కేవలం యాంత్రికంగాలేచి, నాతో చేతులుకలిపాడు. అప్పటివారి ముఖభావం యిప్పటికీనాకు బాగాజ్ఞాపకం. 30 ఏళ్ళక్రితం నెహ్రూగారితండ్రి నన్ను స్వాతంత్ర్యపోరాటపు పెద్దర్యాలీకి పరిచయంచేశారు. నేను ఈవిషయాన్ని వారికి జ్ఞాపకంచేసినా ప్రయోజనం లేకపోయింది.

నేను వారికి క్యూరీవుత్తరాన్ని అందించాను. ఫ్రెంచిమేధావి క్యూరీపట్ల తమకు అత్యంత గౌరవభావముందని చెబుతూ, వుత్తరం చదువసాగారు. ఉత్తరంలో నన్నువారికి పరిచయంచేస్తూ, నా కార్యక్రమంలో సహకరించాల్సిందిగా క్యూరీ నెహ్రూనుకోరారు. కవరులో వుత్తరాన్ని మడిచిపెట్టి, మౌనంగా నావైపు దృష్టి సారించాడు. అంతరంగంలో వారి ఆలోచనాసరళి నాకవగతంకాలేదు. అప్పటివారి ముఖభంగిమ చూచినప్పుడు వారి వున్నతవ్యక్తిత్వం దిగజారినట్లు నాకనిపించింది. వారిపట్ల అంతకుముందు నాకున్న గౌరవాదరాలు తగ్గిపోయాయి. ఓ పెద్దభూస్వామి (జమీందారు) తన చిన్నరైతుతో ప్రవర్తించినట్లు జవహర్‌లాల్ నాపట్ల వ్యవహరించారనిపించింది. బహుశ వారికి తమ సిరి, సంపదలు, భూస్వామ్యదర్పం, స్మరణకొచ్చివుండాలి.

"నేను నా దేశానికి వెళ్ళిన వెంటనే జ్యూలియట్ క్యూరీకు తెలపడానికి ఏమైన చెబుతారా ?" అంటూ ప్రశ్నించాను.

"వారి ఉత్తరానికి నేను జవాబురాస్తా" అంటూ ముక్తసరిగా ఆయన పలికారు.

అంతటితో సంభాషణ ఆగిపోయింది- క్షణకాలం నేను మౌనం వహించాను. నేనొచ్చిన పని వివరాల్ని వారికి తెలపాలి కాబట్టి అప్పుడు జరుగుతున్న ప్రచ్ఛన్న యుద్ధం ఎప్పటి కంతమౌతుందో తెలియదని, దానివల్ల మానవ కళ్యాణం నాశనమౌతుందని, యుద్ధమారంభమైతే అణ్వాయుధ ప్రభావముందని, మానవసంక్షేమం కొరకు శాంతి అత్యవసరమని, అందుకు శాంతిని ప్రతిపాదించే వారందరూ ఐక్యమై ఈ కార్యక్రమాన్ని చేబట్టాలని చెప్పాను.

నా మాటల నన్నిటిని నెహ్రూ నిర్లక్ష్యంగా విన్నారు- కొంత సేపటికి ఆయన "శాంతిపట్ల ఇరు పక్షాలలోను భిన్నాభిప్రాయాలున్నాయి కదా?" అంటూ ప్రశ్నించారు.

"అవును కానీ, యుద్ధాన్నికోరే కొందర్ని మినహాయించి, మిగిలిన శాంతిని ఆశించే వారందరూ ఈ ఉద్యమంలో తప్పక సహకరిస్తారు" అన్నాను నేను.

వారు దీర్ఘమౌనాన్ని వహించడంతో సంభాషణ ముగిసిందని భావించాను. పైకిలేచి చేయిచాపాను, వారు మవునంగా చేయికలిపారు.

"మీకు నావల్లకావల్సిన ఇతరపనులేవైనావుంటే చెప్పండి, చేతనైనసాయం చేస్తా" అన్నారు.

వెనకోసారి భారతదేశంలో కొన్నాళ్ళపాటు వున్నాను. కానీ అప్పుడునాకు తాజమహల్ చూడ్డంపడలేదు. ఇప్పుడుచూద్దామంటే పోలీసుఅధికార్ల సూచనలు అడ్డొస్తున్నాయి. వారిసూచనలమేరకు నేనువెంటనే యూరప్ వెళ్ళిపోవాలి- నేను రేపే ప్రయాణం కావాలనుకొంటున్నాను". అన్నాన్నేను.

నెహ్రూవద్దనుండి హోటల్‌కు తిరిగొచ్చేసరికి నాకు సందేశాన్ని అందించడానికి హోటల్‌మేనేజర్ ఎదురుచూస్తూ కనిపించాడు. నేను ఎప్పుడుఇష్టపడితే అప్పుడు తాజ్ మహల్‌ను దర్శించవచ్చుని ప్రభుత్వం నాకు పెర్మిషన్‌యిస్తూ ఆ సందేశంపంపింది.

"నా బిల్ తయారుచేయండి- తాజ్‌మహల్ చూడ్డానికి నాకిప్పుడు తీరదు. నేను వెంటనే విమానాశ్రయానికి వెళ్ళి పారిస్‌కి తొలివిమానం అందుకోవాలి". అంటూ హోటల్ మేనేజర్‌తో చెప్పేశా.

ఆరేళ్ళ తర్వాత మాస్కోలో లెనిన్ శాంతి బహుమతి సమితి అంతర్జాతీయ వార్షిక మహాసభకు నేను హాజరయ్యాను. ఆ సంవత్సరపు శాంతి బహుమతి పొందడానికి అర్హుల పేర్లు సూచించారు- భారతీయ ప్రతినిధి జవహర్లాల్ నెహ్రూ పేరును ప్రతిపాదించాడు. వెంటనే నా పెదిమలపై చిన్న దరహాసం వెలిసి మాయమైంది. అప్పటి వారి కెవరికీ నా ముఖభంగిమ వెనుకనున్న భావాల గురించి తెలియదు. నేను అప్రయత్నంగా నా ఓటును నెహ్రూకు అనుకూలంగానే వేశాను.

ఆ సంవత్సరం నెహ్రూకు ప్రపంచ శాంతి బహుమతి లభించింది.

[పాబ్లో నెరూడా డైరీ నుండి] అనువాదం : ముదార్ వేణు

# అమరత్వం

ఎ. ఎస్.

నదులమీదుగా,
పొంగిపారే జలప్రవాహాల తరంగాలమీదుగా,
ఇక్కడి మైదానాల నెత్తుటిగానాల్ని,
అడవిలో చిగిర్చే మోదుగుల గానాలుగా మలిచావు-
భయంకర నాగరిక మానవుల బారినుంచి,
అడవిలోనికి ముడ్చుకుపోయిన మనిషికి,
కేకెయ్యటమేకాదు, కోరస్‌పాడటమూ నేర్పిందినువ్వే
"వ్యష్టినుండి సమిష్టి" అదేనీపదం-
రుక్కుబాయి కన్నీటిధారలవెనుక,
దాగిన సమాజదారుణాన్ని,
ఎకరంనేల చెక్కకోసం, గోండులు, కొలాంలు
బతుకంతా చిందించిన నెత్తురుధారల్ని,
కొమురం భీం ఆశల్ని,
వీరమరణాన్ని,
విల్లులా, బాకులా, గొడ్డలిలా, బందూకులా-
మలిచింది నువ్వే-
సాంప్రదాయిక, సామూహిక నగారా,
ఆత్మరక్షణకోసం అడివి అడివంతాకదలబారే
రణన్నినాదంగా మోగించి "తుడుం"
"తుడుం"ని ప్రజాయుద్ధ పిలుపుకోసం
పౌర్కలసార్లు గూడాల్లో కొచ్చినాకే
మోగించినారు-
నువు పౌర్కలసారువి- గూడాలకి-

X X X

మసి, మురికినిండిన కార్మికబస్తీల్లో
ఎద్దుచాకిరినుంచి, బాధల, గాథల పల్లవినుంచి
'పలాయనం' మత్తులో జోగే
యువతకు,
బతుకంటే "రగుల్కొనే రాక్షసిబొగ్గని"నేర్పిందినువ్వే

లక్సెట్టిపేట, జన్నారం, సిర్‌పూర్
బీడుభూముల్లోనేకాదు,
బెల్లంపల్లి, మందమర్రి, రామకృష్ణాపూర్
బొగ్గు రహదారుల్లోనేకాదు
అడవితల్లి కడుపుల్లో
చెరిగిపోని అడుగులన్నీ నీవే-

X X X

కామ్రేడ్,
చలికాలపు దీర్ఘ రాత్రుల్లో
కటకటాల వెనక-
ఒకరి చిట్లిన ఒళ్లు ఒకరం తడుముకొంటూ,
మన ఆశయం చిట్లకుండా కాపాడుకొంటూ,
ఎన్ని మనఃక్లేశాలున్నా
నీ మనసింకా అదే గీతం పాడటం నాకు గుర్తుంది-
యుద్ధరంగంలో బతుకు,
సెకన్ల కాలంలో, వెంట్రుక వాసి ప్రమాదాల్లో-
క్షణం ఫలిల్లుక పగిలి బద్దలైతే
గొంతులో మాట గొంతులో
గొంతులో పదం గొంతులో
గొంతులో నినాదం గొంతులోనే
భౌతికంగా నువ్వికలేవు-

X X X

ఇక్కడి మైదానాల్లో
ఉత్తుంగ పర్వతగర్భాల్లో, అడవిలో
కార్ఖానల్లో, గనుల్లో
వికృత రాక్షస వ్యవస్థ నిర్మూలనకోసం
నీ నినాదం మార్మోగుతూనే వుంటుంది-
గోందుకొలాం గూడాల్లో
మసక వెన్నెల్లో, ధూలాగీతాల్లో విప్లవం విన్పించినన్నాళ్ళు-
జీవితాన్ని, పోరాటాన్ని ప్రేమించే
నీ సోదరులున్నంతకాలం - నువ్వుంటావు-

గోండు, కొలాం గూడాలు బతికేవున్నాయ్-
ప్రజల్లో నీ అచంచల విశ్వాసమూ బతికేవుంది-
వదులు మోసుకుపోవటానికీ, రావటానికీ
వర్ధమాన భవిష్యత్ నువ్వు దిన పోరాటం ఊపిరుంది-
మోయగల్గిన వాళ్ళకోసం నువ్వుమోసిన ఆయుధముంది
చిరకాలమిత్రుడా గంగారాం జోహార్-
నువ్వెంతకాలమైనా- మాలోనూ, ప్రజల్లోనూ-
బతికే ఉంటావ్-

## మృతవీరుల కోసం కన్నీరు కార్చం

మూలం: హెల్డర్ నేతో
స్వేచ్ఛానువాదం : టంకశాల అశోక్

పోరాటంలో మరణించిన వారి గురించి మాట్లాడను నేను

నిను దాచుకున్న నేలపై- కామ్రేడ్ !
మేము కన్నీరు కార్చం, పూలు అర్పించం
దేశ విముక్తికి కావలసింది రుధిరతర్పణం

నిను దాచుకున్న భూమిపై— కామ్రేడ్ !
పిల్లల్ని ఆడుకోనిస్తాం
వారి బొమ్మ రైఫిళ్ళతో

విముక్తికి కావలసింది రుధిర తర్పణం
ఈ దేశపు అత్యుత్తమ తనయుల రుధిర తర్పణం

పిల్లల్ని ఆడుకోనిస్తాం, మేము
పాదాల్ని పదునెక్కనిస్తాం
నిను దాచుకున్న నేలపై ఎడతెగని నడకతో
జొన్నలూ, దుంపలూ పండే పంటభూములవైపు దారితీస్తాం

గాలుల్ని వీచనిస్తాం
పొదగడ్డిని పెరగనిస్తాం-

ఎత్తుగా
సవానా గడ్డిభూములంత ఉవ్వెత్తుగా

వర్షాల్ని కురవనిస్తాం
నిను దాచుకున్న నేలపై— కామ్రేడ్ !
మెచ్చని, మంచి వాసనలు వీస్తాయి
ఈ స్వేచ్ఛా సుగంధం
వానలో తడిసిన నేల వాసన
సారవంతమైన భూమి సువాసన

విముక్తికి కావలసింది రుధిర తర్పణం
ఈ దేశపు అత్యుత్తమ తనయుల రుధిర తర్పణం

నిను దాచుకున్న నేలపై— కామ్రేడ్ !
నీ శౌర్యపరాక్రమాల ఉదాహరణలందుకొని
ముందుకుపోతాం—
వీలైనంత దూరం
సాధ్యమైనంత వేగంతో— మునుముందుకు పోతాం....
నీ శౌర్యాన్ని, త్యాగాన్ని
ప్రజాభ్యుదయానికి పనిముట్టు చేస్తాం

నిను దాచుకున్న నేలపై— కామ్రేడ్ !
పోరాటంలో మరణించినవారి గురించి మాట్లాడను నేను
నేను మాట్లాడను కామ్రేడ్ !.... కాని
నిను దాచుకున్న నేలపై
అంగోలా విముక్తి కోసం
ప్రతి ఘడియా
అనుక్షణం
నేను గొంతెత్తి గర్జిస్తాను
ఆ గర్జన
నీ చివరి గర్జన
నీవు కూల్చిన చివరి శత్రుశిబిరంపై నీ వెనువెంట దూకిన
కామ్రేడ్స్ గుండెలలో ప్రతిధ్వనించిన గర్జన

ఆ గర్జన
నీ చివరి గర్జన
విను పరిమార్చినట్లు భ్రమసిన శత్రువు భయవిహ్వలనలో
ప్రతిధ్వనించిన గర్జన

ఆ గర్జన
నీ చివరి గర్జన
వేల వలుచెరగులా ప్రతిధ్వనించి
వేనవేల గర్జనలను రేకెత్తించిన గర్జన

ప్రతి ఘడియా
అనుక్షణం
వేనా గర్జన చేస్తాను
నీ చివరి గర్జన
పొలికేక

అడ్వాన్స్...!

---

## సింగరేణి కార్మికుడు

సూర్యం

సింగరేణిబతుకు
పిత్రిమైనాది అన్నోరిఓకార్మికకన్నఅన్న
పీకల్లనువ్‌లేసి
పనికిబోతావు ”
బస్సులేకనువు
బాధపడుతావు ”
సకలతిప్పలుబడి
పేరుకుంటావు ”
చేముమించిపోయిందని
నీడికత్తారు ”

కొర్లచ్చెబోనికి
కట్టమేమెరుకొ ”
బతిమిలాడినవ్
పనికెక్కుతావు ”
బొగ్గుఉన్నదంటే
[1] కాలుండదామో
అన్నోరి ఓలాడిసన్న అన్న

కాలున్నదంటె
లైనుదూరమామో ”

---

1. ఖాళీబబ్బుల సప్లయి

మోతదూరమయి
మొస్పగొడుతావు ,,
గర్మిఎక్కువయ్యి
గావరైతావు ,,
గాలిలేకనువ్
గల్లతవుతావు ,,
నీల్లులేకనువు
నీల్గి సూత్తావు ,,
[2]రేసులెక్కలేక
నెరి బడుతావు ,,
మందాసనలోన
బొందకైతావు
అన్నోరిఓలాడీసన్న అన్న

ఒకటబ్బుకువాడు
సారుసీటిచ్చె ,,
సారుసీటియిచ్చి
సానతిప్పలుబెట్టె ,,
నీనొప్పి అడగరుగాని
బాధపెడుతారు ,,
పనిమీద పనిజెప్పి
పదిపనులు చేయించు
అన్నోరిఓమజ్దూరన్న అన్న

రాల్లుమోసుడాయె
రోల్లుమోసుడాయె ,,
మల్వమోసుడాయె
మన్నుమోయ్యాలె ,,
సున్నంమోసుడాయె
ఇసుకమొయ్యాలె ,,
తుంటమోసుడాయె
పెంటమొయ్యాలె ,,
మోటర్లుకడుగాలె
బట్టలుతుకాలె ,,
ఏపనిజేసినా
అక్టింగులుంచె ,,
కంపినీదొరలంత
కటికోల్లువాళ్ళు
అన్నోరిఓకార్మికన్న అన్న

కష్టజీవులమంత
కలిసిఉందాం ,,
కట్టాన్ని దోసేటి
కంపినీదొరలా ,,
కలిసిఎదిరిద్దాం
నిలిసిపోరేము
అన్నోరిఓకార్మికన్నా అన్నా

దోపిడిరాజ్యాన్ని
దూరముచేసి ,,
కార్మికరాజ్యాన్ని
కనుక్కుందాం ,,

---

2. చఢావు (పైకి)

# ఆంధ్రుల చరిత్ర - సంస్కృతి - 1

మనదేశ చరిత్రకు సంబంధించి శాస్త్రీయమయిన సైద్ధాంతిక పరిశోధన గత 25 సంవత్సరాలుగా మాత్రమే జరుగుతోందని చెప్పవచ్చు. అంతకు ముందు విషయ సేకరణ విస్తృతంగా జరిగింది, ఎంతో మంది ఎంతో శ్రమించారు, కాని వ్యాఖ్యానంలో మాత్రం శాస్త్రీయత స్థానాన, అసందర్భమయిన 'దేశభక్తి', అసహ్యాకరమయిన మతోన్మాదం, అశాస్త్రీయమయిన జడాత్మక పిడివాదం (మార్క్సిజం లేబెల్ అంటించుకున్నది) రాజ్యంచేసాయి. గత 25 సంవత్సరాలుగా, డి. డి. కోశాంబితో ప్రారంభమయి ఇర్ఫాన్ హబీబ్ వరకు, సైద్ధాంతిక వ్యాఖ్యానానికి బలమయిన శాస్త్రీయ భూమికను ఏర్పరచారు. ఈ పుస్తకం ఆ ఒరవడిలోనిదే. రచయిత సత్యనారాయణగారి మీద కోశాంబి ప్రభావం స్పష్టంగా కనబడుతుంది. అయితే కోశాంబి చూపినమార్గాన పురోగమించారా అంటే అనుమానమే. చాలవరకు కోశాంబిని అనుసరించారు. ఒకటి రెండు చోట్ల (ఉదాహరణకు "ప్రాచ్యసమాజం" అనే భావనకు సంబంధించి) కోశాంబి కంటే రెండడుగులు వెనక్కి వేసారు.

మన దేశంలో వచ్చిన మొదటి సామాజిక విప్లవం ఆర్యులు తెచ్చింది. మన దేశానికి వచ్చినప్పుడు వాళ్ల పశుపోషకులే అయినా, ఆహార సేకరణ పోడువ్యవసాయాల స్థానాన స్థిరవ్యవసాయాన్ని, ఇనపనాగలినీ, అడవిప్రాంతాలను వ్యవసాయ యోగ్యంగా చదునుచేయడంకోసం ఇతర ఇనప పనిముట్లను, ప్రవేశపెట్టడం, స్థిరవ్యసాయం మీద ఆధారపడ్డ వ్యావసాయిక వర్గసమాజానికి పునాదివేయడం, ఆర్యులుసాధించింది. ఇది ఉత్తరాన ప్రారంభమయి క్రమంగా దక్షిణానికీ తూర్పుకూ విస్తరించింది. ఆంధ్ర ప్రాంతంలో ఈ వ్యావసాయిక వర్గసమాజపు మొట్టమొదటి స్పష్టమయిన రాజకీయ రూపం శాతవాహన సామ్రాజ్యం.

స్థిర వ్యవసాయంలో ఉత్పాదకత పెరుగుతుంది కాబట్టి అదనపు ఉత్పత్తితోబాటే వ్యవసాయేతర సరుకుల ఉత్పత్తిగూడ సాధ్యమవుతుంది. అంటే శ్రమవిభజన, వస్తుమార్పిడీ ముందుకువస్తాయి. ఈ చారిత్రక సన్నివేశంలో మనకు ప్రపంచంలో అన్నిదేశాల చరిత్రలోను ఒక వింతకనబడుతుంది: అపారమయిన అమ్మకపుసరుకుల ఉత్పత్తి, మారకం, రోమ్‌నుండి భరుకచ్ఛంవరకు, మచిలీపట్నంనుండి చైనావరకు పట్టువస్త్రాలు, ఆభరణాలు, సుగంధద్రవ్యాలు, చందనం, ఇత్యాది విలాసవస్తువుల నుండి, నూలుబట్టలు నెయ్యి నూనెలదాక అన్నీ ఎగుమతిఅయ్యేవి, దిగుమతిఅయ్యేవి

(పేజీ108). ఇది వర్గసమాజపు శైశవడాంబికం. పుట్టగానే పెట్టుబడిదారీ సమాజమనుకుంటుంది కాబోలు, ఎడాపెడా సరుకులనుత్పత్తి చేస్తుంది, మారకంచేస్తుంది, సముద్రయానానికి సంబంధించి తనకున్న మిడిమిడిజ్ఞానంతోనే 'సప్తసముద్రాల'నూ కాకపోయినా అందుబాటులోఉన్న సముద్రాలనన్నింటినీ చుట్టివస్తుంది.

కాని ఈ డాంబికం చాలకాలంనిలవదు. తానింకా వ్యావసాయిక సమాజమేననీ, తనకు పునాది వ్యవసాయమేననీ, ఆ వ్యవసాయరంగాన్ని బలంగా దిద్దుకోవడం, వ్యవసాయదారుల అవసరాలకు ప్రాధాన్యతనివ్వడం, ఇప్పటిఅవసరమనీ గుర్తిస్తుంది. వ్యవసాయేతర ఉత్పత్తి గూడ వ్యవసాయానికి అనుబంధంగా సాగాలని, అంటే కావలసింది స్వర్ణకారులూ ఆభరణకారులూకాదు, కమ్మరీ కుమ్మరీ వడ్రంగీననీ గుర్తిస్తుంది. దానితో అన్నిదేశాలలోను, స్వయంపోషక గ్రామాలుఏర్పడినా ఏర్పడకపోయినా, వ్యవసాయాన్ని పునాదిగానేకాక కేంద్రంగాగూడగల ఆర్థికవ్యవస్థ రూపొందుతుంది. ఏదో ఒకతరహా ఫ్యూడలిజానికి దారితీస్తుంది. పైపై పరిశీలకులకు ఇది తిరోగమనంగా కనిపించవచ్చు. "చీకటియుగం ఆరంభమయ్యిం"దనిపించవచ్చు ఒకప్పుడు స్వేచ్ఛగా దేశదేశాలు తిరిగినమనిషి గ్రామానికి బందీ అయిపోయాడనిపించవచ్చు. ఈ చరిత్ర దశలో "ఆంధ్రుడు ఊబిలో దిగబడ్డాడనేచెప్పాలి.... పురోహితవర్గం పెద్దరికంతో వున్న సమాజం అతనిజీవితాన్ని స్వయం సంపూర్ణగ్రామంలో మూసిపెట్టివుంచి"ందనిపించింది సత్యనారాయణ గారికిగూడ (పేజీ 192) కాని ఇది అవశ్యమయిన పరిణామం, పురోహితుల కుట్రకాదు. పెట్టుబడిదారీ సమాజం రాకముందు విస్తృతమయిన వ్యవసాయేతర సరుకుల ఉత్పత్తి, మారకం, సాధ్యంకావాలంటే, వ్యవసాయదారుడి అవసరాలను పూర్తిగా విస్మరించి అతన్ని అత్యధికంగా పీడించాలి. యూరప్‌లోలాగ అతను అన్నిదేశాలలోను బానిసకానవసరంలేదు. కాని బానిసకానంతమాత్రాన ఈ సుగంధద్రవ్యాల ఎగుమతిచాటునవున్న అమానుషత్వం తక్కువదికాదు. వ్యవసాయం ప్రధానమయిన సమాజంలో వ్యవసాయేతర ఉత్పత్తికిగూడా వ్యవసాయరంగాన్నే కేంద్రంగామలచడం ఫ్యూడలిజంయొక్క మౌలికమయిన అభ్యుదయకత్వం. తరువాతి కాలంలో అదే విపరీతమయిన మతమౌఢ్యానికి దారితీసిందన్నది వేరేవిషయం.

మరయితే ఈ శాతవాహనకాలంనాటి ఆర్థికవ్యవస్థ ఎట్లాంటిది? సత్యనారాయణ గారి అభిప్రాయంలో అది బానిసవ్యవస్థకాదు, ఫ్యూడల్ వ్యవస్థాకాదు, "ఫ్యూడల్ పూర్వదశ" (పేజీ 176). ఉత్పత్తిదారులయిన శూద్రులు ఒక వర్గంగా దోచుకోబడ్డారే గాని బానిసలుగా కాదు. విస్తృతమయిన అమ్మకపు సరుకుల ఉత్పత్తి ఉండడంచేత

ఫ్యూడల్ వ్యవస్థాకాదు. ఉత్తర భారత చరిత్రలో శాతవాహనుల కాలాన్ని పోలిన మౌర్యుల కాలానికి సంబంధించి కోశాంబి మార్గదర్శకత్వాన్ని అనుసరించే చరిత్ర కారులకు దాదాపుగా ఈ అభిప్రాయమే వున్నట్లుంది.

ఈ "ఫ్యూడల్ పూర్వదశ" అనంతరం, అమ్మకపుసరుకుల ఉత్పత్తి తగ్గి (తల సరిగా) వ్యవసాయేతర ఉత్పత్తికి గూడ గ్రామమే కేంద్రమయింది. పైన వివరించి నట్లు ఈ పరిణామం ఆవశ్యమయినది, మౌలికంగా అభ్యుదయకరమయినది. అయితే ఈ గ్రామీణస్వయం పోషకత్వం ఎప్పుడూ సాపేక్షికమే కోశాంబి అన్నట్లు, ఉప్పు ఇనుము లాంటి అత్యవసర వస్తువులు అన్ని గ్రామాలలోను దొరకవు కాబట్టి అటు వంటి సరుకుల మారకం ఎప్పుడూవుంటుంది. అంతే కాకుండ రాజులకూ రాజవంశీకు లకూ సామంతులకూ దర్బారీ జనానికీ కావలసిన విలాసవస్తువుల ఉత్పత్తి పట్టణాలలో సాగుతూనేవుంటుంది. ఇన్ని మినహాయింపులున్నప్పటికీ గ్రామీణ స్వయంపోషకత్వం వాస్తవికమయిన భావనే. రాజకీయంగా ఈ కాలం ఇక్ష్వాకులనుండి పల్లవులవరకు విస్తరించినది (క్రీ. శ. 3వ శతాబ్దం వరకు) దీనిని సత్యనారాయణగారు "ప్రాచ్య సమాజం పరిధిలో ఫ్యూడలిజానికి పునాదులు పడ్డదశ" అన్నారు (పీఠిక, పేజీ 8) ఈ "దశ"కు సంబంధించి సత్యనారాయణగారు ఇచ్చిన వర్ణననుబట్టి చూస్తే ఇది దాదాపుగా కోశాంబి Feudalism from above అని వర్ణించిన క్రీస్తుశకం మొదటి శతాబ్దాల ఉత్తరభారత సమాజాన్ని పోలివుంది. ఉత్పత్తిదారులయిన రైతులశ్రమను శిస్తురూపంలో సామంతప్రభువులు, వారిపైనున్న రాజులు మహారాజులు, చేజిక్కించు కున్న దశయిది.[1] దీనిని తెలుగులో "సామంత స్వామ్యం" అనవచ్చు

ఈ దశలోనే తరువాతిదశకు బీజాలుఏర్పడ్డాయి గ్రామీణప్రాంతాలలో భూమిలో స్వంతహక్కు, ఇతర ఫ్యూడల్‌సౌకర్యాలున్న భూస్వాములు తలెత్తడం మొదలయింది. బ్రాహ్మణులకు అగ్రహారాలు దానంచేయడంతో ఇది ప్రారంభమయి, సైన్యాధిపతులకు జాగీర్లివ్వడంతోను, గ్రామాధికార్లకు జీతాలకుబదులు భూములు ఇవ్వడంతోను, విస్తరించింది రాష్ట్రకూట చోళచాళుక్యుల కాలంలో (ఏడవశతాబ్దం తరువాతికాలంలో ఈమార్పు వేగంపుంజుకుని కోశాంబిచెప్పిన Feudalism from below అనేదశకు దారితీసింది. దీన్ని తెలుగులో "గ్రామీణభూస్వామ్యం" అనవచ్చు. సత్యనారాయణగారు "ప్రాచ్యసమాజం పరిధిలో ఫ్యూడలిజం ఆవిర్భావం, అభివృద్ధిని తెలియజేసేదశ" అన్నారు.

ఈ రెండుదశలకు సంబంధించి రచయిత కోశాంబితో నిర్దేతుకంగా విభేదించి నట్లుంది. కోశాంబిచేసిన నామకరణం అంత సంతృప్తికరం లేనిమాట వాస్తవమే,

ముఖ్యంగా Feudalism from above అనేభావన ఉత్పత్తి సంబంధాలను స్పష్టంగా నిర్వచించదు. అయినా "ప్రాచ్యసమాజం" అనేభావన మరీ అసంతృప్తికరం. ప్రాచ్య దేశాలలో (అంటే ఆసియా ఆఫ్రికాదేశాలలో) ఫ్యూడలిజంబదులు ఒకప్రత్యేకమయిన ఉత్పత్తివిధానంవుండేదని మార్క్స్ భావించాడు. దానిని "ప్రాచ్యఉత్పత్తివిధానం" (Asiatic made of production) అన్నాడు. దీనిముఖ్యలక్షణాలు : (i) భూమి మీద ఎవ్వరికీ స్వంతహక్కు లేకపోవడం (ii) వ్యవసాయానికి అవసరమయిన నీటి పారుదల వసతులను (చెరువులు, కాలువలు) కేంద్రప్రభుత్వం నిర్వహించడం (iii) తత్పర్యవసానమయిన కేంద్రీకృతరాజ్యాంగం, లేక "ప్రాచ్య నిరంకుశత్వం" (vi) గ్రామీణ స్వయంపోషకత్వం. వీటిలో మొదటిమూడు పరిశోధనలకు నిలవ్వు. చాల ప్రాచీనకాలంనుండిగూడ రాజులు సన్నిహితులకు, బ్రాహ్మణులకు, బౌద్ధవిహారాలకు ఇనాంలు ఇవ్వడంజరిగింది దక్షిణాన శాతవాహనుల కాలంలోనే ఇనాంలు ఇచ్చిన ఆధారాలున్నాయి. ఈ ఇనాందార్లకూ జాగీర్దార్లకేకాకుండ మధ్యయుగాలనాటికి రైతులకుగూడ కొలసందర్భాలలో భూమిమీద స్వంతహక్కుండేదని ఇర్ఫాన్ హబీబ్ చూపించాడు. నీటిపారుదల వసతుల నిర్వహణగూడ ఎన్నడూ కేంద్రీకృతంగా వుండలేదు. గ్రామసమితులు సామంతులు నిర్వహించేవారు. ఇక ప్రాచ్యనిరంకుశత్వం మాటకొస్తే, 'అప్రాచ్య' నిరంకుశత్వం దానికెన్నడూ తీసిపోలేదు. అసలు ఈ సూత్రీకరణలకు దేనికీ మార్క్స్ ఎంగెల్స్‌లకు అందుబాటులోవున్న రచనలలో గూడ ఆధారంలేదని నయీద్‌నక్వీ వివరంగా వాదించాడు 2 ఇంక ప్రాచ్యసమాజం'లో మిగిలిందేమిటి ? గ్రామీణ స్వయంపోషకత్వం మాత్రమే. అందుకేకాబోలు సత్య నారాయణగారు దీనినే ప్రాచ్యసమాజం నిర్వచనంగా అంగీకరించారు. అయితే గ్రామీణ స్వయంపోషకత్వం శ్రమవిభజన తాలూకు ఒకరూపం అవుతుందేగాని ఉత్పత్తిసంబంధం కాజాలదు. కాబట్టి ఒకఉత్పత్తి విధానానికి నిర్వచనంగా దానిని తీసుకోవడంతప్పు. పైగా మార్క్స్‌గూడా ప్రాచ్య ఉత్పత్తివిధానం అనేమాటను స్వయంపోషక గ్రామీణవ్యవస్థ అనేఅర్థంలో వాడాడనడంతప్పు (పీఠిక, పేజీ 9) మార్క్స్ భావనలో పైనచెప్పిన నాలుగుఅంశాలూ వున్నాయి. వాటన్నింటిలోనికీ మార్క్స్ నీటిపారుదలవసతుల కేంద్రీకృత నిర్వహణకు, భూమిలో స్వంతఆస్తి లేకపోవడానికి, కీలకస్థానం యిచ్చినట్లు అనిపిస్తుంది.

పుస్తకంలో మరొక ముఖ్యమయిన లోపం వుంది. ఆంధ్ర ప్రాంతానికి సంబంధించిన ప్రత్యేకమయిన చారిత్రిక సంఘటనలను వివరించడానికి రచయిత చేయదగ్గ ప్రయత్నం చేయలేదు. బౌద్ధంలో మహాయాన పంథారావడం, తరువాత

బౌద్ధం క్షీణించిపోవడం, దాని స్థానంలో వైదికమతం విస్తరించడం, ఆటుతరువాత వైదికమతం పతిధిలోనే శైవవైష్ణవ ఉద్యమాలు రావడం, శాతవాహనుల తరువాతి ఆంధ్రచరిత్రలో ముఖ్యఘట్టాలు. వీటిలో బౌద్ధంస్థానాన వైదికమతం ప్రబలమయిన ఘట్టాన్ని మాత్రం కొంతవరకు వివరించారు. వ్యవసాయ ఉత్పత్తికీ వాణిజ్యానికీ అవరోధమయిన పశుపోషక సమాజపు వైదికకర్మనికాండను వ్యతిరేకించిన బౌద్ధమతం, వాణిజ్యానికీ వాణిజ్యవిస్తరణకూ మరీ సన్నిహితమయిపోయిన కారణాన స్వయం పోషక గ్రామీణ వ్యవస్థ ఆవిర్భవించడంతో తన సామాజిక పాత్రను కోల్పోయింది. అయితే బౌద్దమతం ఈ కొత్త పరిస్థితుల కనుగుణంగా తన రూపాన్ని ఎందుకు మార్చుకోలేకపోయింది? చైనానుండి శ్రీలంక వరకు భూస్వామ్య సమాజాల భావజాలమయిన బౌద్ధం మనదేశంలో మాత్రం ఆ పాత్ర నిర్వహించడంలో హిందూమతం ముందు ఎందుకు ఓడిపోవలసివచ్చింది? మనదేశం భూస్వామ్య సమాజవ్యాప్తిలో వైదికమతానికి పునాది అయిన వర్ణవ్యవస్థకుగల కీలకమయిన పాత్రను గురించి కోశాంబి వివిధ సందర్భాలలో చెప్పిన విషయాలలో దీనికి సమాధానం లభించవచ్చు. అటువంటి సమాధానం సంపాదించడానికి ఆంధ్ర చరిత్ర చాల అనుకూలమయిన సందర్భం, ఎందుచేతనంటే ఒకప్పుడు ఇక్కడ బౌద్ధం చాల వ్యాప్తిని కలిగివుండి, తరువాతికాలంలో సంపూర్ణంగా పెకిలించివేయబడింది. కాని అటువంటి ప్రయత్నం సత్యనారాయణ గారు చేయలేదు. అలాగే మహాయానం పుట్టుకకు, శైవవైష్ణవ ఉద్యమాల పుట్టుకకు గల మౌలికమయిన కారణాలను సంతృప్తికరంగా వివరించేప్రయత్నమూచేయలేదు. ముఖ్యంగా ఈ చివరి ఘట్టానికి సంబంధించి "భక్తి ఉద్యమం పురోహితవర్గంవారి ఆశల్నీ ఆశయాల్నీ కాక ప్రజాసామాన్యం యొక్క అభిమానాల్నీ ఆశయాల్నీ వ్యక్తం చేస్తుంది" అని రచయిత చేసిన వ్యాఖ్యానం (పేజీ 232) బొత్తిగా ఫ్యూడల్ పండితుల వ్యాఖ్యలాగావుంది ("జ్ఞానమార్గం మేధావులకూ భక్తిమార్గం ప్రజాసామాన్యానికీ" అన్నదే గదా ఫ్యూడల్ పండితుల మతం).

నిజానికి ఇది ఆంధ్రుల చరిత్ర కాదు. మన దేశంలో అన్ని ప్రాంతాల చరిత్రకూ (స్థూలంగా) సామాన్యమయిన పరిణామక్రమానికి ఆంధ్రప్రాంతాన్ని ఒక ఉదాహరణగా తీసుకొని ఇచ్చిన వివరణ. కోశాంబి, ఆర్. ఎస్. శర్మల రచనలతో పరిచయంవున్న వారికి ఇందులో స్థానిక వివరాలు మినహాయించి కొత్త విషయాలేవీ కన్పించవు. అయితే విపులంగా రాసిన కారణాన ఇది అంత మేరకు ఉపయోగకరమయిన పుస్తకమే. తెలుగువాడికి తన చరిత్రకు ఏటుకూరి బలరామమూర్తిగారు ఎవ్వరి పరిశోధనలనూ పట్టించుకోకుండ అర్థరహితంగాను అపరిష్కృతంగాను పునః

అనగనగా ఓహీరో. ఆయనకి 'చదువు, సంస్కారం, అందం, ఐశ్వర్యం, వినయవిధేయతలు. అన్నిటికీమించి నిజాయితీ' పుష్కలంగాఉన్నాయి- ఇందులో ఒక్క ఐశ్వర్యంతప్ప హీరోయిన్‌కు తక్కినగుణాలన్నీ ఉన్నాయి- కథాక్రమంలో నవల ఐదోపేజీలో హీరోయిను, పద్దెనిమిదోపేజీలో హీరోమనకు పరిచయమవుతారు. వాళ్ళిద్దరూ 92వ పేజీలో ఒకర్నొకరు కల్సుకుంటారు- మనం ఆశించినట్టుగానే ప్రేమించుకుంటారు- తర్వాత అపార్థాలువస్తాయి- ఆతర్వాత ఓవిలన్, ఓహాస్యగాడు, ఓవ్యాంప్ (ఈవిడ క్యాబరేడ్యాన్స్ చెయ్యకపోవడం ఓపెద్దలోపం!), బలాత్కారం, మోసం, ఫ్లాష్‌బ్యాక్, తుపాకులు, కాస్తస్కాండల్ మరింతఫైటింగ్, సందర్భ రహిత సంస్కృత ఉపమానాలు, మోతాదుమించిన నాటకీయత, కథ ఆగిపోయినా ఆగని పాత్రల ఉపన్యాసాలు మొదలయిన అవాంతరాలన్నీ దాటుకుని వాళ్ళిద్దరు 260వ పేజీలో మళ్ళీ ఏకమవుతారు, విలన్‌కి పిచ్చెక్కడంతో 270వ పేజీలో నవల అంతమవుతుంది. ఈ కథంతటికి పూర్వరంగం - పంచాయతీరాజ్ రాజకీయాలు- పట్టణంలో పెద్దచదువు చదువుకొనికూడా ప్రజా ప్రయోజనంకోసం మన హీరో తన మామ (ఆయనే దుర్గుణాలన్నీ మూర్తీభవించిన మన విలన్) సహాయంతో గ్రామ రాజకీయాలలో ప్రవేశిస్తాడు, ఆయనకుతోడు మరో మూర్తీభవించిన ఆదర్శమూర్తి మన హీరోయిన్ తండ్రిగారు- ఇంచుమించుగా అవేఉద్దేశ్యాలతో మన హీరోయిన్

---

పునర్ముద్రిస్తూన్న 1953 నాటి ఆంధ్రుల సంక్షిప్తచరిత్రే ప్రామాణికంకాదని చూపించి, గత ఇరవయిఅయిదు సంవత్సరాలుగా జరుగుతున్న పరిశోధనతో ఈ పుస్తకం పరిచయం ఏర్పరిస్తే సంతోషమే.

— బాలగోపాల్

References

1. An Inrtoduction to the study of Indian History, p. 295
2. K. M. Kurian (ed), India - Stateand Society అనే సంకలనంలో సయీద్‌నక్వీ వ్యాసం చూడండి.

---

ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర - 1, కంభంపాటి సత్యనారాయణ, సంక్షిప్తానువాదం: మహీధర రామమోహనరావు హైదరాబాద్ బుక్‌ట్రస్టు ప్రచురణ (జూలై 1981), పేజీలు : 256 + 6 + xxiv (ఆంధ్రదేశ పటంతో) వెల రు. 12-00, ప్రతులకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-694, హిమాయత్ నగర్ హైదరాబాద్ 500 029.

గ్రామసేవికగా చేరుతుంది- వాళ్ళిద్దరు గ్రామంలోని దుష్టశక్తులన్నింటితోను సుమారు రెండువందలపేజీలు పోరాటంచేసింతర్వాత ధర్మం గెలుస్తుంది- అధర్మం ఓడిపోతుంది- ఈనవల మనకు చూపించదల్చుకున్న విషయం (రచయిత్రిభాషలో) 'స్వరాజ్యంవచ్చి ముప్పైమూడేళ్ళయింతర్వాతకూడా భూస్వామ్యవ్యవస్థకు ప్రతిరూపంగా నిలబడిన గ్రామీణభారతం'- అందులో 'అభ్యుదయ పథగాములైన' రామచిలుకలకి- 'తరతరాల భూస్వామ్యవ్యవస్థ ప్రతినిధుల'యిన రాబందులకు మధ్యజరిగే సంఘర్షణ.

ఇలాంటి నవల మీ కళ్ళబడితే మీరేం చేస్తారు?

తెలిసిన నిర్మాత కెవడికో సినిమా తీయమని సిఫార్సు చెయ్యవచ్చు. లేకపోతే ఏదో ఒకవిశ్వవిద్యాలయంలో అభాగ్యులయిన విద్యార్థులకి పాఠ్యాంశంగా నిర్ణయించవచ్చు. కాక దీన్ని విమర్శనాత్మకంగా పరిశీలించి రచయిత్రిని, పాఠకుల్ని, తెలుగు విమర్శనా సాహిత్యాన్ని ఎడ్యుకేట్ చెయ్యవచ్చు. అరుదయిన ఈ మూడో దారిని ఎన్నుకున్నందుకు ఈ నవలపై ప్రస్తుత పరిశీలనను అహ్వానించాలి.

ఇటీవల కాలంలో తెలుగు సాహిత్యంలో అగ్రస్థానాన్ని నవల - సీరియెల్స్ ధర్మమా అని - ఆక్రమించింది. హీరోహీరోయిన్ల ప్రేమపాట్లతో ఆరంభమయి మాంత్రిక తాంత్రిక దశకు చేరుకున్న తెలుగు నవల ఆ క్రమంలో వేలరూపాయల పెట్టుబడి, లక్షల సర్క్యులేషన్ నిర్ణయాత్మకంగా నడిపించే వ్యాపారవస్తువుగా పరిణమించింది. గతంలో చెప్పుకోదగ్గ మంచి నవలలు రాసిన రచయితలు కూడా ఈ తాకిడికి తట్టుకోలేకపోయారు. సీరియెస్ విమర్శకుతగ్గ నవలల టూ ఏమీ లేకపోవడంతో విమర్శనా సాహిత్యం క్రమక్రమంగా నవలకు దూరమయి పాఠకులకి, రచయితలకు అన్యాయం చేసింది. ఆ దృష్ట్యా ఈ పరిశీలన చాలా కాలం తర్వాత జరిగిన ఒక సీరియెస్ ప్రయత్నం.

సాహిత్యం - అది ఏలాంటి సాహిత్యమవనివ్వండి - సమాజాన్ని, కాలాన్ని ప్రతిఫలిస్తుందని మనం ఇవ్వాళ గుర్తిస్తున్నాం. అందుకే ఏ సాహిత్యాన్నయినా అంచనా వేయడానికి సమాజ - సాహిత్య సంబంధాలపై పరిశీలన అవసరం మన విమర్శకులకి రచయితలకున్నపాటి సమాజ పరిజ్ఞానం లేకపోవడం, మన సామాజిక శాస్త్రవేత్తలకు సాహిత్యపరిచయం లేకపోవడంతో ఒక కృత్రిమ అగాథం ఈ పరిశీలనలను అసాధ్యం చేసింది. అడపాదడపా కొందరు మాత్రం (కొ. కు, రారా, కెవిఆర్, వరవరరావు వగయిరా) ఈ ప్రయత్నం చేస్తూనే వచ్చినా ఇది చెప్పుకోదగ్గ ఒక ధోరణిగా బలపడలేదు ఈ పరిమితుల్లో ఈ ఇద్దరూ- ఒకరు తెలుగులో, మరొకరు పరిపాలనా శాస్త్రంలో పరిశోధకులు- సమష్టిగా ఈనవలను పరిశీలించారు- అందుకు ఇద్దర్నీ అభినందించాలి.

'సామాజికార్థిక రాజకీయవిజ్ఞాన పరిచయంలేకుండా సాహిత్యం అవగాహన కావటం కష్టం' అన్నభావనతో ఈ నవలను వీళ్ళు పరిశీలించారు. తమ పరిశీలనా క్రమంలో వాళ్ళు చక్కగా నవలలో అనేకాంశాల్ని వివరించగలిగారు. అందులో ముఖ్యమయినవి : కథా కాలంనాటి కాలప్రభావాలు నవలపై లేకపోవడం, ఆధునిక విద్యావిధానంపై అవగాహనలేకుండా తత్ఫలితాలను మాత్రమే పాక్షికంగా విమర్శించడం, మొత్తంగా పాత్రలలో ప్రతిఫలించే సాంఘిక ఆర్థికచైతన్యం వాస్తవ దూరమయినదికావడం, నవల పూర్వరంగమయిన పంచాయతీరాజ్ స్వరూప స్వభావాలపై, నిర్మాణంపై ప్రాథమిక పరిజ్ఞానం లేకపోవడం, ఆ పూర్వరంగంలో ఏర్పడే మానవ సంబంధాలను సలక్షణంగా చిత్రించలేకపోవడం, కాక గ్రామీణములా రాజకీయాలు మానవ జీవితపువిలువలను ఎలా నాశనంచేస్తున్నాయో, దోపిడీరూపుదిద్దుకుంటున్న కొత్తపద్ధతులెలా పనిచేస్తున్నాయో, పంచాయతీరాజ్ వ్యవస్థ ఎలా విఫలం చెందుతోందో రచయిత్రి నిరూపించగల్గిందనికూడా వాళ్ళు అభిప్రాయపడ్డారు. అన్నిటికీ మించి ఈ పూర్వరంగాన్ని ఎన్నుకున్నందుకు రచయిత్రిని వాళ్ళు అభినందించారు.

అక్కడక్కడ పరస్పర విరుద్ధమయిన వ్యాఖ్యలుమినహాయించి (చూ. పే 42 మొదటిపేరా, రెండోపేరాలలో మానవసంబంధాల చిత్రీకరణపై) ఈ అంశాలు చాలా వరకు సరయినవే. అయితే విమర్శకులిద్దరూ వదిలేసిన రెండుఅంశాలని చర్చించాలి.

మొదటిది : గ్రామీణప్రాంతాలలో జీవనసంఘర్షణకు అతీతంగా పంచాయతీ రాజకీయాలను చిత్రీకరించడం- ఉదాహరణకు మన గ్రామాలలో ప్రధానమయిన సమస్యలు భూమి, వ్యవసాయం. ఈ రెండుకూడా పొరబాటునకూడా రచయిత్రి చిత్రించలేదు- ఈ సమస్యల పునాదిమీదే మన గ్రామాలలో అంతస్థులతో కూడుకున్న సమాజం (hierarchial society) ఏర్పడింది. అంతస్థీకరింపబడ్డ సమాజం ఆస్తి, కులం, వృత్తి, చదువు, జీవనప్రమాణం- మొదలయిన అన్నిఅంశాలలోనూ ప్రతిబింబిస్తోంది. వాటి వర్గప్రాతిపదికను తమఅవగాహనకు మౌలికంగా మార్క్సిస్టులు భావిస్తారు అయితే మార్క్సిస్టేతరులుగూడా మన గ్రామాలలోఉండే అంతస్థీకరింపబడ్డ సమాజాన్ని గుర్తించ నిరాకరించరు. పంచాయతీరాజ్ ఈ అంతస్థులను బలపరచిందేగాని బలహీనపరచలేదని ఇవ్వాళ ప్రభుత్వమేధావులుకూడా ఒప్పుకుంటున్నారు. ఈ అంతస్థులమధ్య సంఘర్షణే పంచాయతీ రాజకీయాలలో ప్రతిఫలిస్తోంది. ఇందులో ప్రధాన పాత్రదారులు, భూస్వాములు, కొత్తగా బలం పుంజుకుంటున్న ధనిక రైతులు, పాలకులకుపనికివచ్చే మధ్యతరగతి. ఈనవల పునాదిసమస్యలను పట్టించుకోదు. అంతస్థు

లను అనివార్యంగా గుర్తించినా వాటి అంతర్ సంబంధాలను, వైరుధ్యాల్ని, పంచాయతీపై వాటి ప్రభావాన్ని అర్థంచేసుకో ప్రయత్నించదు. అందుకే పంచాయతీ రాజకీయాలను హీరోవిలన్ల మధ్యజరిగే ఘర్షణగామాత్రమే చిత్రీకరిస్తుంది- మన గ్రామాలలో హీరోలు, విలన్లు లేకుండాపోలేదు. అయితే ఈ నవలలోలాగా వాళ్ళు తమ వ్యక్తిగత స్వభావాలవల్ల హీరోలు, విలన్లుగా రూపొందరు- సామాజికాభివృద్ధికోసం జరిగే నిరంతర సంఘర్షణలో వాళ్ళపాత్రనుబట్టి హీరోలు, విలన్లుగా రూపొందుతారు. ఈ సంఘర్షణ నుండి విడదీస్తే వాళ్ళు ఊహాజనితమయిన గాలి దయ్యాలవుతారు. గాలి దయ్యాల్ని పాత్రల్నిచేసి మంచి తెలుగు సినిమా ఒకటి నిర్మించుకోవచ్చు, కాని సమాజాన్ని - రచయిత్రి ప్రకటించుకున్నట్లు విశ్లేషించలేం.

రెండవది : రచయిత్రికి నవల స్వరూపం గురించి అవగాహన లేకపోవడం. ఒక చిన్న సంఘటనను చిత్రించేది కథఅయితే అలాంటి పదిపదిహేను సంఘటనలను అల్లితే నవల అవుతుందని ఆవిడ భావనలావుంది. జీవిత వాతావరణం లేకుండా సంఘటనల పరంపర చిత్రించడం నవల కాదు (చూడండి. కొ.కు. 1946లోనే రాసిన 'నవలా - చిన్నకథ' వ్యాసం- 'సాహిత్య ప్రయోజనం' వ్యాసావళి) నవలకు ప్రధానమయినది పాత్రల పరిణామంద్వారా సంఘ జీవితాన్ని, దానిచలనాన్ని చిత్రించడం. ఈ నవలలో పాత్రలు పరిణామం చెందవు. అవి ప్రత్యేకించి ఏ జీవిత వాతావరణానికి చెందవు దానికిబదులు అన్ని మంచిగుణాలే ఉండి మచ్చువి ఒక్క చెడ్డగుణమయినా లేనివి, అన్ని చెడ్డలేగాని ఒక్క మంచిగుణమయినాలేనికి అనే రెండు రకాల పాత్రలు ఒక సంఘటన నుండి మరో సంఘటనకు గెంతుతుంటాయి. (అసలీరకం సద్గుణ / దుర్గుణ విభజనలు మన సాహిత్యంలో ఎప్పుడు ప్రవేశించాయో చరిత్రకారులు పరిశోధించాలి. ఆరంభ ప్రాచీన సాహిత్యంలో ఈ రకమయిన మనుషులు తగలరు). ఈ రకంపాత్ర విభజనలో ఉండే అవాస్తవికత బొత్తిగా అసంబద్ధమయిన పాత్రలకు సన్నివేశాలకు దారితీసి చివరికి అక్కడక్కడ చదివించే శక్తిని కూడా చావుదెబ్బతీసింది. శోభ, కాత్యాయనీ విద్మహే గారలు చేసిన విమర్శలో సాహిత్యపరంగా పుస్తకాన్ని పరిశీలించడానికి తీవ్రమయిన ప్రయత్నం చేసినట్టు కన్పించదు. నవలా స్వరూపం, పాత్రల పరిణామాలపై అవగాహన లేకపోవడంవల్ల వచ్చిన లోపాలని ఇతరత్రా మాత్రమే విమర్శిస్తూ (ఉదా॥ శేఖరం పాత్రగురించి పే. 13, సునంద శేఖరంల పెళ్ళి గురించి పే 15), రచయిత్రిని అనవసరంగా క్షమించి వదిలేసారు.

విమర్శకులు రచయిత్రి నడిపినకథలోనూ, పాత్రల సంభాషణలోనూ, వ్యాఖ్యానాల్లోనూ, సమాజం ఎలాప్రతిఫలించిందో, వాళ్ళదృష్టిలో ఆ సమాజం అలా ఎందు

## ఏసియాడ్ - 82 ఏనుగు పాదాల కింద...

తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవరో ఏమో కాని ఏసియాడ్ - 82 ఆటలకోసం ఢిల్లీలో కోట్ల రూపాయల ఖర్చుతో లేస్తున్నకట్టడాల నిర్మాణానికి రాళ్ళెత్తుతున్న కూలీల్లో సూరజ్‌మణి ఒకరు. భర్తా, ముగ్గురు పిల్లలతో ఎక్కడో ఒస్సాలోని మయూర్‌భంజ్ జిల్లా నయనా గ్రామం నుండి వచ్చిన గిరిజనస్త్రీ ఆమె. ఢిల్లీలో పని యిప్పిస్తానని తీసుకువచ్చిన 'పెద్ద మనిషి' మళ్ళీ కనిపించకుండాపోయాడు. చేతిలో పైసా కూడా లేని ఆకుటుంబం ఆ మహానగరంలో ఏ పనీలేక పస్తులుండాల్సిన పరిస్థితి ఏర్పడ్డది. తమ వూరు తిరిగిపోవడానికి ప్రయాణ ఖర్చులకోసమైనా డబ్బు సంపాదించాలి. 82 నవంబర్‌లో ఇందిరా గాంధీ పుట్టినరోజు వైభవం నాటికి ఏసియాడ్-82 కట్టడాల నిర్మాణం పూర్తి కావాలని ఎక్కడలేని తొందరపడుతున్న కాంట్రాక్టర్లకు ఆమే, ఆమె భర్తా, పిల్లలూ అతిచౌకగా దొరికిపోయారు.

ఈ దేశంలో సగంకంటె ఎక్కువ మంది పేదరికంలో వున్నారు. చాలా పాఠశాలలూ, కాలేజీలకు స్వంత భవనాలు లేవు, ఆటస్థలాలు అసలే లేవు. ఈ విషయాల గురించి ఏ మాత్రం పట్టింపులేని ప్రభుత్వం ఆసియాఖండపు దేశదేశాల్లోని ఆట

---

కుందో బాగా వివరించగలిగారు. పైగా ఈ వివరణలో రచయిత్రి చైతన్యంతో నిమిత్తంలేకుండా సమాజం ప్రతిఫలించిందనే విషయాన్ని చెప్పకనేచెప్పారు. అయితే సమాజ - సాహిత్య సంబంధాల పరిశీలనకు ఇది సరిపోతుందాఅని సందేహం. ఈ రకమయిన విమర్శ ఏపద్ధతులలో చేయాలో (methodology) ఒక స్పష్టమయిన అవగాహన విమర్శకులకున్నట్లుతోచదు. నిజానికి ఇప్పుడిప్పుడేవస్తున్న ధోరణిలో ఈ అవగాహనఉండే అవకాశంలేదుకూడా. బహుశా పూర్వరంగమయిన సమాజాన్ని (ఈ నవలలో గ్రామీణజీవితం, పంచాయతీరాజ్) విశ్లేషణాత్మకంగా వివరించి తర్వాత నవలను పరిచయంచేసి, ఆ తర్వాత ఆసమాజం ఈనవలలో ఎలాప్రతిఫలించిందో చూపించగల్గితే ఈప్రయత్నం మరింత విజయవంతమయ్యేదేమో।

అయినా ఈ చిన్నపరిశీలనను సాధారణపాఠకులు, రచయితలు, ముఖ్యంగా విమర్శకులు ఆహ్వానించాలి. ఈ పరిశీలనపై విమర్శనాత్మకంగా ప్రతిస్పందించడం ఈ విమర్శకులిద్దరుచేసిన సాహసానికి మనమివ్వగల అభినందన.

-సురా

---

'పంచాయతీరాజ్య రాజకీయనవల - వాసిరెడ్డి సీతాదేవి రాబందులు - రామ చిలుకలు - ఒక పరిశీలన', కాత్యాయనీ విద్మహే, శోభ, [మార్చి 1981], పేజీలు 44 + iv, వెల రు. 2-00, ప్రతులకు : రచయిత్రులు, ఆర్ట్స్ అండ్ సైన్స్‌కాలేజ్, వరంగల్ 506010

---

గాళ్ళంతా వచ్చి హాయిగా ఆడుకోవడానికి వీలుగా ఏడువందల కోట్ల రూపాయలు ఖర్చు చేసి స్టేడియములూ, ఫ్లయ్‌ఓవర్లూ, హోటళ్ళూ, విహారకేంద్రాలూ కట్టిస్తున్నది. బయటి ప్రపంచంలోనైనా మంచి పేరు సంపాదించుకోవాలనే తాపత్రయమే యిది. దీని ఫలితంగా ప్రజలపై పన్నులభారం మరింత ఎక్కువవుతుంది. ధరలు ఇంకా పెరుగుతాయి.

ఇదిట్లా వుండగా, యివన్నీ నిర్మిస్తున్న కూలీలకైనా ప్రభుత్వం చెప్పేన్యాయం ప్రకారంగానైనా న్యాయం జరుగుతున్నదా అంటే అదీ లేదు. కనీసవేతన చట్టం, అంతర్ రాష్ట్ర వలస కూలీల నియామక చట్టం, వెట్టిచాకిరీరద్దు చట్టం, కాంట్రాక్టర్ల కూలీలకు కల్పించవలసిన కనీస సౌకర్యాల గురించిన నిబంధనలు- యివన్నీ యీ ప్రభుత్వం చేసినవే. అంతర్జాతీయ కార్మిక సంఘ ప్రతిపాదనలు- యీ ప్రభుత్వం అంగీకరించినవే. కాని ఏసియాడ్-82 కాంట్రాక్టర్లు వీటిని అమలుచేయకపోవడం గురించి ప్రభుత్వం పట్టించుకోదు. ఎప్పుడు ప్రాణంపోతుందో తెలియని జబ్బులూ, ప్రమాదాల మధ్య తక్కువ కూలీకి ఎక్కువ పనిచేస్తున్నారు కూలీలు. ఈ పని మాను కొని వేరేపనిలో చేరే హక్కులేక కొందరు కూలీలు నిజానికి వెట్టిచాకిరీ చేస్తున్నారు.

వీళ్ళలో సూరజ్‌మణి లాగా అసహాయస్థితిలో ఇక్కడికి వచ్చి చేరిన వాళ్ళు కొందరైతే మరికొందరు ఇందిరా కాంగ్రెస్ వారి కిసాన్ ర్యాలీకి తీసుకురాబడి తిరుగు ప్రయాణానికి డబ్బు లేక రాజధాని నగరంలో అనాథలుగా మిగిలిపోయినవాళ్ళు.

బిహార్, ఒరిస్సా, బెంగాల్, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాల్లోని వెనుకబడిన జిల్లాలకు చెందిన పేదరైతులు, భూమిలేని కూలీలు పొట్టచేతబట్టుకుని పనులకోసం ఢిల్లీ వస్తుంటారు. పెద్దపెద్ద కుటుంబాలను పోషించాలి; నిస్సారమైన భూముల్లోంచి ఏ పంటారాదు; పని దొరుకదు; దొరికినా, అతి తక్కువ కూలీరేట్లు: వీటన్నిటితో పిచ్చెక్కిపోయి ఎంత దొరికినా చాలని ఢిల్లీకి పారిపోయి వస్తున్నవాళ్ళు ఎందరో వున్నారు. ఒరిస్సాలోని మయూర్‌భంజ్, కలహంది, జిల్లాలకు కొంజహర్ చెందిన గిరిజనుల సంఖ్య ఎక్కువ. ఉత్తర భారతదేశంలో ఈ మధ్య వచ్చిన వరదలకు గురిఅయి ఢిల్లీ చేరుకుంటున్న వాళ్ళ సంఖ్య మరీ ఎక్కువవు తున్నది. ఇటువంటివాళ్ళకోసం వేటాడుతూ మేస్త్రీలుంటారు. ఈ మేస్త్రీల ద్వారా వీళ్ళు కాంట్రాక్టర్లవలలో చిక్కుకుంటారు.

'ఏడాది తర్వాత ఇరాక్‌కో, ఇరాన్‌కో పంపిస్తాను, అక్కడ వేల రూపాయలు సంపాయించవచ్చు'ననే ఆశ చూపించి వందమంది కూలీలను పట్టుకొచ్చి ఫ్లయ్‌ఓవర్

కట్టడం పనిలో పెట్టాడు చక్రిరత్ అనే మేస్త్రి. ఏడాదిలోగా ఈ పని అయిపోతుంది. తర్వాత అతను వాళ్ళకు కనిపించడు. ఇప్పుడైతే రోజూ కూరగాయలకు ముప్పావలా, కాసిన్ని బియ్యం ఇస్తున్నాడు. ఒరిస్సా దాదన్ చట్టం ప్రకారం కూలీ చెల్లిస్తున్నా అంటున్నాడు. ఇంగ్లీష్ వారి పరిపాలనా కాలంలో చేసిన ఈ చట్టం ప్రకారం కూలీలకు కొంత డబ్బు ముందే ఇచ్చి ఆ డబ్బు ఇచ్చినందుకుగాను తన ఇష్టమున్నంత పని వాళ్ళతో చేయించవచ్చు.

చట్టప్రకారం కనీస కూలీ తొమ్మిది రూపాయల పావలా అయితే పెరిగిన ధరల ప్రకారం గత జనవరిలో పదకొండుంబావలా ఇవ్వాల్సి వుండగా వాళ్ళకు నిజానికి ఇచ్చింది ఎనిమిది లేదా అంతకన్న తక్కువే. ఇప్పుడయితే ఇంకా ఎక్కువకూలీ రావాలి. ఏ రోజైనా పని బాగా చేయలేదని కాంట్రాక్టర్‌కు అనిపిస్తే ఆ రోజు కూలీ దక్కక పోయే ప్రమాదం కూడా వున్నది.

వేరే రాష్ట్రాల నుండి వచ్చి పనిచేస్తున్న కూలీలకు ఒక్కొక్కరికి డెబ్బయ్ అయిదు రూపాయాలు కానీ, నెలలో సంపాదించే కూలీ మొత్తంలో సగంకానీ, (ఏది ఎక్కువైతే అది) కూలీలో చేరేముందే కాంట్రాక్టర్ వాళ్ళకు ఇవ్వాలి, అంతర్ రాష్ట్ర వలస కూలీల నియామక చట్టం ప్రకారం కాని ఇవ్వడం లేదు. పనులు పూర్తయేంత వరకు గృహవసతి, ఉచితవైద్య సదుపాయం కల్పించాలి. క్రమం తప్పకుండా కనీస వేతనాలు చెల్లించాలి. కానీ ఇవేమీ అమలు కావడం లేదు.

తల్‌కటోరా అనేచోట ఉండడానికి ఇచ్చినవి ఇళ్ళుకావు, గుడారాలు అవైనా మంచివి కావు. వర్షంవస్తే వంటకు కష్టం. వండింది నిలువచేసుకోను కష్టం. నిద్ర పోవడం కుదరదు. ఇటువంటి గుడారం ఒక్కొక్కదానిలో నలుగురి నుండి ఆరుగురి దాకా మూల్‌చంద్ ఫ్లమ్‌ఓవర్ స్థలంలో ఏ వసతిలేని రేకుల షెడ్లు. రాత్రిపూట ఒక కరెంటు బల్బు కూడా ఉండదు. మిగతాచోట్ల ఎక్కువగా కనిపించేవి గుడిసెలు. అసమంజమిత్రా అనే ఒక అధికారి ఏమంటున్నాడంటే- ఈ గుడిసెలూ, మురికి కొంపలూ, మన సమాజంలో ఒక భాగమే కదా ఇవి ఇక్కడ మాత్రం ఉంటే తప్పేమిటీ ? అని.

నీళ్ళవసతిఉండదు, మరుగుదొడ్లు వుండవు, పక్కనున్న అడవిప్రాంతంలోకి పోయి కాలకృత్యాలు తీర్చుకోవాలి. మూల్‌చంద్ ఫ్లమ్‌ఓవర్ కట్టేస్థలంలో ఆరు మరుగుదొడ్లున్నా రెండింటికి తాళాలు : అవి అధికారులకోసం. ఒకటి చిన్న కంటాక్టర్‌కు మిగిలిన మూడు మరుగుదొడ్లు మూడువందలమంది కూలీలకోసం. మంచి నీళ్ళగా సప్లయ్‌చేయబడుతున్న మురికినీళ్ళుతాగి ఒకరిచావు, ఎందరికో జబ్బులు.

ఉచిత వైద్యసదుపాయం కల్పించాలనే, చట్టంవున్నప్పటికీ ఇక్కడ అటువంటి దేమీ లేదు. అశోకాహోటల్ దగ్గర పబ్లిక్ సెక్టర్ హోటల్ భవనం కడుతున్న బాబూ లాల్ బస్సీ, ధోపాలీలనేవాళ్ళు ఒరిస్సాలోని బోలంగిరినుండి వచ్చినవాళ్ళు. రక్తపు విరేచనాలతో చచ్చిపోతూ పనికిపోయే స్థితిలో లేరు. వాళ్ళకుటుంబాల్లో ఎవరూ పనికి పోవడంలేదు. జబ్బువల్ల పనిచేయడంలేదు. కాబట్టి కూలీఇవ్వరు- డాక్టరు ఒకసారి వచ్చి కొన్ని మాత్రలుఇచ్చి పోయాడు. జబ్బుతగ్గలేదు. ఇపుడేమో బయటినుండి మందులు కొనుక్కొచ్చుకొమ్మంటున్నాడు. మందులకు వాళ్ళదగ్గర డబ్బులెక్కడివి!

ఇనుపదూలంఎత్తుతూ చేయి విరగొట్టుకున్నాడు- బీహార్‌లోని సరసానుంచి వచ్చిన మదన్. కొన్నిమాత్రలుఇచ్చి చేతికి కట్టుకట్టాడు డాక్టర్- చేయి మరింత వాచింది- బయటినుండి ఇంజక్షన్లు తెచ్చుకోమంటున్నాడు డాక్టర్- మదన్‌కు ఆస్తోమత లేదు.

విలేజ్ కాంప్లెక్స్‌లో పనిచేస్తున్న యువకుడు ఘనశ్యాం గుడిసెలోనివాళ్ళంతా జబ్బుపడ్డారు. చికిత్సకోసం వాళ్ళు తమకూలీడబ్బులలోనుండే ఖర్చుపెట్టుకోవాలి.

ప్రమాదాలజరగకుండా తీసుకునేజాగ్రత్తలు అధికారులు తీసుకోరు- ఫలితంగా ఎన్నోప్రమాదాలు జరుగుతున్నాయి. హోటల్ కౌసల్య భవనం కడుతున్నప్పుడు ఒక గోడకూలడంవల్ల తలకు బలంగా గాయాలుతగిలి ఒకకూలీ అక్కడికక్కడే చని పోయాడు. విలేజ్‌కాంప్లెక్స్‌లో కప్పైనటార్లులేకుండా బావితవ్వుతుండగా బావికూలి ఒకతను చనిపోయాడు. సిమెంట్‌మిక్సర్‌లో వేళ్ళు తెగ్గొట్టుకున్నతను ఇంకొకాయన- ప్రమాదానికి గురయినవాళ్ళకు నష్టపరిహారంలేదు. అంతేగాక, పనిలోకిపోలేని పరిస్థితిలోవున్నరోజుల్లో కూలీకూడాఇవ్వరు.

ఆడకూలీల పరిస్థితి మరీ అధ్వానంగావున్నది- 1976లో చేసిన సమానజీతాల చట్టం ప్రకారంగానీ, భారతప్రభుత్వం అంగీకరించిన అంతర్జాతీయ కార్మిక సంఘ సమానజీతాల ప్రతిపాదనల (నెం. 100) ప్రకారంగాని పురుషునితో సమానంగా స్త్రీకి కూలీచెల్లించాలి. కానీ ఇక్కడ ఆ చట్టాన్ని, ప్రతిపాదనలను ఖాతరుచెయ్యడం లేదు. ఆడకూలీకి ఏడురూపాయలే ఇస్తున్నారు.

చట్టప్రకారం పిల్లలను పనిలో పెట్టుకోకూడదు- కాని ఆటలాడుకునే వయసులో వున్న పిల్లలెందరో ఇక్కడ తట్టలుమోస్తూ ఇతరులు ఆడుకునేందుకు నిర్మించేకట్టడాల పనిలోవున్నారు. పదేళ్ళ రాముకు తనకు ఎంతకూలీవస్తుందోతెలియదు- తమిళనాడు నుండి వచ్చిన పదిహేనేళ్ళ పాచముత్తుకు రోజూ ఎనిమిదిరూపాయలు ఇస్తున్నారు. 1979లో చేసిన చట్టంప్రకారం ఇటువంటిపనుల్లో పిల్లలను పెట్టుకోకూడదు అయితే

"పని తొందరగా అయేందుకుగాను, కూలీలు తక్కువపడ్డప్పుడు పిల్లలను పనిలోకి తీసుకుంటున్నాం" అంటున్నారు ఎన్. డి. ఎం. సి.కి చెందిన ఒక జూనియర్ ఇంజనీర్.

చిన్నపిల్లలున్న ఆడకూలీలు ఒకవైపు కూలీపనిచేస్తూ మరోవైపు పిల్లలను చూసుకోవాల్సివున్నది. తల్లులు పనిలో ఉన్నప్పుడు పిల్లలను చూసేందుకనివున్న 'క్రెష్' అని బోర్డువున్నగది (విలేజ్‌కాంప్లెక్స్‌లో) లోనికిపోతే లోపల పిల్లలెవరూ కనిపించరు. ఆఫీసుగది వుంటుంది- అంతే కొన్నాళ్ళకింద అక్కడికివచ్చిన ఇందిరాగాంధీని సంతోషపెట్టేందుకని ఆ బోర్డు అక్కడపెట్టాడు కాంట్రాక్టర్- తను కూలీలపిల్లలపట్ల ఎంతో శ్రద్ధచూపిస్తున్నట్టు తెలుపుకునేందుకు. అయితే ఒకసేవాసంస్థ నడుపుతున్న 'క్రెష్' ఒకటి మరోచోటఉంది. దానిలో రోజూ 150 నుండి 200 దాకా పిల్లలను సంరక్షిస్తారు. ఇంకో 'క్రెష్'కూడా వుందట అయితే వేలమంది పనిచేస్తున్న స్థలంలో రెండు 'క్రెష్'లు ఏమాత్రం సరిపోవు.

తమ ఇబ్బందులు చెప్పుకునేందుకు, కొన్ని సదుపాయాలయినా సాధించుకునేందుకు సంఘం ఒకటి పెట్టుకుందామంటే అధికారులు, కాంట్రాక్టర్లు అడ్డుపడుతున్నారని అధీర్ బిస్వాస్‌అనే బెంగాలీకూలీ చెప్తున్నాడు- చట్టప్రకారం తమకు ఏఏ హక్కులున్నదీ తనకు తెలుసంటున్నాడు- అయితే ఏమీచేయలేని పరిస్థితుల్లో వున్నానన్నాడు- బీహార్‌వాడైన జాలానంద్‌యాదవ్ తమ ఇబ్బందులు చెప్పుకుంటుంటే మొహిందర్ భగత్ అనే మేస్త్రీవచ్చి అతణ్ణి బెదిరించాడు.

ప్రజాస్వామ్య హక్కుల ప్రజాసంఘం (PUDR) తరఫున ఒక కమిటీ జూలై 20 నుండి ఆగస్ట్ 10 వరకు ఏసియాడ్-82 ఆటల కట్టడాల నిర్మాణస్థలాలన్నీ తిరిగి, అక్కడ పనిచేస్తున్న కూలీల జీవనస్థితిగతుల గురించి ఆగస్ట్ 17న పత్రికా విలేకరుల సమావేశంలో ఒకరిపోర్టు వెలువరించింది. దీనిఫలితంగా- పత్రికా విలేకరులతోసహా ఎవరినీ ఇక ఆ ప్రాంతంలోనికి పోనివ్వడంలేదు. కూలీలలో దిన దినం అసంతృప్తి పెరిగి పోతున్నది. ఒక డిజైన్ విషయంలో ఒక బ్రిటిష్ ఇంజనీర్ తన అభిప్రాయం తెలిపినందుకుగాను కొన్నిలక్షల రూపాయలు ఇచ్చారు కాంట్రాక్టర్లు. ఇంతకీ ఆ డిజైన్ పనికిరాకుండాపోయి అన్నిలక్షల రూపాయలఖర్చు దండగేఅయింది. ఇట్లా డబ్బు వృధాచేస్తారుగానీ కూలీలకు కనీస సదుపాయాలు కల్పించరు డబ్బులేకకాదు.

డాన్సుచేస్తున్న ఏనుగు - ఏసియాడ్ - 82 చిహ్నం. ఏసియాడ్ - 82 కోసం తమరక్తాన్ని చెమటగా ధారపోస్తున్న కూలీలు ఈ ఏనుగుపాదాలకింద నలిగిపోతున్నారు,

సాహిత్య లేఖలు :

సృజన ఒక ఆధునిక సాహిత్యవేదిక అనీ, విప్లవసాహిత్య ప్రచారానికి తన యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నదనీ మేం అభిప్రాయపడుతున్నాం. మాఅభిప్రాయంలో పొరపాటు ఏమీ లేదనిగూడా మేం భావిస్తున్నాం. ఈ కృషిలో విప్లవ రచయితలు గూడా యథాశక్తి శ్రమిస్తున్నారని గూడా అనుకుంటున్నాం.

ఐతే ఈ విప్లవ సాహిత్య ప్రచారం ఎలాజరగాలి? కేవలం విప్లవ పార్టీనో, లేదా దానిపట్ల కన్విక్ట్ ఐన కొందరు వ్యక్తులు, లేదా సంస్థలూ తాముస్వయంగా కొన్ని పరిధుల్లో చేసే ప్రచారంవల్ల విప్లవ కళాసాహిత్యరంగాల పరిమితి పెరగడం అసంభవ మని మా వుద్దేశం.

ఒక పరిమితమైన పరిస్థితుల్లో అంటే ఒక ప్రాంతానికి చెందిన మాండలికమూ, జీవన విధానమూ, అక్కడి పోరాటాలు ఉదహరిస్తూనైనాసరే- రాసినందువల్ల తగు మాత్రం ఉపయోగం వుండదేమో అన్పిస్తుంది.

ఉదాహరణకు అల్లం రాజయ్యగారి ఏరచనైనాసరే కేవలం కరీంనగర్- ఆదిలాబాద్ జిల్లాల పోరాటాల్ని చిత్రిస్తూవుంటాయి. అక్కడి ప్రజలూ, సంస్కృతీగూడా యథాతథంగా వుంటాయనే మేం అనుకుంటున్నాం. ఐతే మా పరిశీలనలో తేలిన విషయం ఏమిటంటే రాజయ్యగారి రచనలు కేవలం పోరాటం మీద అభిమానమూ, అవగాహనా ఉన్నవాళ్లూ, లేదా రాజయ్యగారి మీద అభిమానం ఉన్నవాళ్లూ "తప్పని సరిగా" చదివి అర్థంచేసుకున్నారే తప్ప ఇతరులు- వాటినంతగా పట్టించుకోలేదని తేలింది. అసలు విప్లవ సాహిత్యం సంగతే తెలియని వాడికి మన సాహిత్యం ఇలాంటి రచనలవల్ల ఏ విధమైన సందేశాన్ని అందిస్తూ వుంటుందో మాకర్థంకాలేదు. లేక విప్లవ సాహిత్యానికి ఆ అవసరం ఏమీ లేదా?

కరీంనగర్- ఆదిలాబాద్ జిల్లాల రైతాంగపోరాటాలు, 'రైతాంగపోరాటాలు' అనే అంటున్నాం. అవి నక్సల్బరీ, శ్రీకాకుళపోరాటాల కొనసాగింపే అనిగూడా మేం ఉద్దేశపడుతున్నాం. అక్కడి పోరాటాలు మధ్యయుగాల నిరంకుశపాలనవంటి దౌర్జన్య పద్ధతులకు వ్యతిరేకంగా రగిలినవే. ఈదేశంలో అనాదికాలంనుంచీఉన్న గోండుతెగల పోరాటశక్తినీ, వారికి ఈ దేశంపైన గల అనివార్యమైన అధికారాన్నీ హక్కునీ తెలుపుతున్నాయి. ఇలాంటిపోరాటాలు, ఉద్యమాలగూర్చి రాసేప్పుడు అవి ఎంతో ప్రచారంపొందేట్టుగావుండటం అవసరం- అలాకాపోతే రచనలు చేయడం అనవస రం- రచనలు- కళాసాహిత్యాలు ప్రచారంకోసమే అని మేం నమ్ముతున్నాం.

ప్రజల్లో మనభావాలు ప్రచారంచేయడంకోసం ఉద్దేశింపబడ్డ రచనలు ఎక్కువ మంది ప్రజల్లోకి వెళ్ళకపోతే ఆ రచనకి సార్థకతఉండదు. మాండలికాల్లో రాయబడ్డ నవలలు, కథలూ ఆయామండలాలవరకే పరిమితమై పోతాయనిమేం గమనించాం. వేలమంది చదువుతున్నారుగదా ఇంకేం? అనేది వాస్తవాన్ని విస్మరించడమే కాగలదు.

లక్షలాదిమంది అక్షరాస్యులూ, పాఠకులూ ఉన్న ఆంధ్రదేశంలో వేలమంది మాత్రమే చదవడం - వారికే అందటమూ, అర్థంకావడమూ ఒకవిధమైన ఫెయిల్యూర్. మన రచనలు ఎక్కువమంది పాఠకులు, అక్షరాస్యులూ చదివేట్టుగా ఉండాలి- దానికోసం పత్రికల భాష ఎక్కువ ఉపయోగపడుతుందని మా అభిప్రాయం. ఇదికేవలం మా అభిప్రాయంకాదు మేం ఎన్నోచోట్ల, ఎన్నోజిల్లాల్లోవిన్న, తెలుసుకున్న అభిప్రాయం గూడా.

ఈసందర్భంగా మేం విప్లవరచయితలందరికీ ఒక సూచనచేస్తున్నాం- ఏమిటంటే రచనలు ముఖ్యంగా కథలు, నవలలూ విరివిగారాయాలి. అవి విప్లవపత్రికల్లోనేగాక ఇతర పత్రికల్లోగూడా రాయాలి విప్లవంఅనేది భాషలోనేకాదు భావాల్లోగూడా రావాలి విప్లవకథల్లో, నవలల్లో పోరాటాలు, జెండాలు, కత్తులు, కటార్లు విధిగావుండవలసిన అవసరం ఏమీలేదు. జీవితంయొక్క కాన్వాస్ చాలపెద్దది. ఎన్నోకోణాల నుంచి దాన్ని మన విప్లవావసరాలకోసం వినియోగించుకోవచ్చు.

విప్లవరచయితలు ఈ పనిచేయడం మానేసినందువల్లనే తులసిదళంలాంటి నవలలూ, వాటితోకలూ పుట్టుకొచ్చి ప్రజల్ని మరింత అజ్ఞానంవైపు నడుపుతున్నాయి, వాటిప్రభావం తాత్కాలికమే. విప్లవరచయితలు ఇప్పటికైనా ఈ లోపాల్ని సవరించాలి తెలుగుదేశంలో ప్రచురింపబడుతున్న ప్రతీ పత్రికల్లోనూ. కనీసం మూడు విప్లవరచనలు రావాలి రచయితలు ఆవిధంగా కృషిచేయాలి విప్లవపత్రికలు చదివే వాళ్ళే పాఠకులనీ, మిగతావాళ్ళు కాదనిఉన్న అభిప్రాయాన్ని తొలగించుకుని విప్లవ 'రచయితలు' తమపేర్లను సార్థకం చేసుకుంటారని ఆశిస్తున్నాం.

— సాహితీ మిత్రులు, హైదరాబాద్

## మా. గోఖలే

సుప్రసిద్ధ కథారచయిత, అగ్రశ్రేణి చిత్రకారుడు, అభ్యుదయవాది, మా గోఖలే మృతిపట్ల 'ప్రగతిసాహితి' తీవ్రసంతాపం వ్యక్తపరుస్తున్నది.

1943లో అభ్యుదయ రచయితల సంఘం స్థాపనకు ముందూ, ఆ తర్వాతా- కథారచన, జర్నలిజం, చిత్రకళల ద్వారా ఆయన అభ్యుదయ సాహిత్యోద్యమానికి, కమ్యూనిస్టుపార్టీకి విలక్షణమైన సేవచేసారు. ఈ కృషిలో ఆయన తన జీవితసమస్యలనుగాని, ప్రభుత్వ ఒత్తిడినిగాని సరకుచేయలేదు.

కథలు రాయడం ఇటీవల తిరిగి ప్రారంభించి, మళ్ళీ వరుసగా రాయనున్నట్లు మిత్రులతో ఉత్సాహంగా చెప్తుండిన గోఖలే మరి కొద్ది కాలానికే జబ్బుపడి మరణించడం, ఆయన కలం శాశ్వతంగా ఆగిపోవడం సాహిత్యరంగానికి చాలా నష్టదాయకమైన విషయం.

12-10-1981 — కన్వీనర్, ప్రగతి సాహితి, న్యూఢిల్లీ

నాటకరంగం మీద అణచివేత

## కేరళ 'జనకీయ సాంస్కృతిక వేది' ఖండన

వర్తమాన భారత నాటకరంగం కొన్ని అంశాలలో ఎంతో ముందడుగు వేసింది. అది విప్లవ ప్రజానీకపు అనుభూతులను, కష్టాలనూ, ఆశలనూ, స్వభావాలనూ ప్రతిభావంతంగా గానం చేస్తున్నది; మేధోశావట్యాల్నీ, వ్యాపార ప్రయోజనాల్నీ నిరాకరిస్తున్నది. ఆధునిక భోగాలతో అలంకృతమైన వర్తమాన నాటకరంగానికి వ్యతిరేకంగా అది నిరాడంబరంగానూ సూటిగానూ ఉంటున్నది. ఈ నూత్న చైతన్య స్రవంతి సామ్రాజ్యవాద లోకయాత్రల కోరల్లోపడి నలిగిపోతున్న పీడిత ప్రజానీకానికి శక్తివంతమైన చైతన్య వాహికగా తయారయింది.

ఈ నాటకరంగాన్ని అణచివేయడానికి రాజ్యాంగయంత్రం శక్తి సమకూర్చుకుంటోంది. ఉత్తరప్రదేశ్, మణిపూర్ నాటక బృందాలపై దాడి జరగడం దీనిలో భాగమే. కేరళలో 'నడుగడిక' నాటక బృందం నిర్బంధించబడింది. మూడు నెలల తర్వాత బెయిల్‌పై విడుదలైనప్పటికీ కఠినమైన బెయిల్ నిబంధనలవల్ల వాళ్ళిప్పటికీ ఆ నాటకాన్ని ప్రదర్శించలేక పోతున్నారు. వాళ్ళపై రాజద్రోహ నేరవిచారణ కొనసాగుతోంది.

ఢిల్లీలో 1876 నాటి బ్రిటిష్ నల్లచట్టాల తర్వాత మళ్ళీ ఇన్నాళ్ళకు నాటకరంగంపై నల్లచట్టాలు విధించబడ్డాయి. కొత్తచట్టం ప్రకారం నాటకపు ప్రతి ప్రదర్శనకు ముందుగా సెన్సార్ బోర్డ్‌కు అందజెయ్యాలి. దీంట్లో పోలీస్ అధికారులు, లెఫ్టినెంట్ గవర్నర్‌చే నియమించబడిన అధ్యక్షుడూ ఉంటారు. అధ్యక్షునికి వీటో అధికారం ఉంటుంది. మానవహక్కులను, సహజమైన ఆలోచనను అడ్డుకునే ఈ నల్లచట్టం సిగ్గులేకుండా ప్రవేశపెట్టబడింది.

ఢిల్లీ కళాకారులందరూ వెంటనే ఈ కొత్త నల్లచట్టాలను ఖండించారు. జనకీయ సాంస్కృతిక వేది వాళ్ళకు తన సంఘీభావాన్ని ప్రకటిస్తోంది. మానవహక్కులకు, భావప్రకటనా స్వేచ్ఛకు, సృజనాత్మక ప్రతిభకు సవాల్‌గా నిలిచిన ఈ పరిస్థితిని ధైర్యంగా ఎదుర్కోవాలని, ప్రతిఘటించాలని అభ్యుదయవాదులైన ప్రజలకు, కళాకారులకు, మేధావులకు మేం విజ్ఞప్తి చేస్తున్నాం.

— సివిక్ చంద్రన్

కార్యదర్శి, జనకీయ సాంస్కృతిక వేది, కేరళ.

2వ కవర్ తరువాయి....

శాసన సభాప్రతినిధులకు మూడురోజులు పట్టింది. సరే, ఆత్మరక్షణకోసమైనాసరే నాగేశ్వరరావును హత్యచేశాడని నీవేఅంటున్న అమృతరెడ్డిని అరెస్టుచేశావా? హత్యా నేరంమోపి కోర్టులో హాజరుపరచావా? తన కస్టడీలోంచి నిందితుడు తప్పించుకున్నం దుకు అంతేకాదు ఆ నిందుతునికోసమే తన జీపువెనుక అనధికారివస్తున్నా ఎందుకు వస్తున్నాడనే సోయిలేనందుకు లేదా అభ్యంతరం చెప్పనందుకు చివరకు అతనిచేతుల్లో నిందితుడు పడ్డందుకు ఆ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ను విధి సక్రమంగా నిర్వహించని నేరానికి కనీసం సస్పెండ్ చేసావా? ఈ ప్రశ్నలు విప్లవానికో, ప్రజాస్వామ్యానికో సంబంధించినవికూడాకావు. కేవలం చట్టానికి సంబంధించి, చట్టపరిమితుల్లో, పోలీసులే ఇచ్చిన సమాచారం ఆధారంగా పోలీసులకు వేస్తున్న ప్రశ్నలు- పోలీసు యూని ఫా(ర)మ్ వేసుకోవడమే చట్టం, పోలీసు అధికారుల అధికారాలను అడగడానికి పౌరులకున్న అధికారమేమిటి అనిఅంటే చట్టాలు చట్టుబండలని ఎవరునేర్పుతున్నట్లు?

## ఆదిలాబాద్ గిరిజన సహాయనిధి

C/o సృజన, హనుమకొండ 506001

గతసంచికలో ప్రకటించిన విరాళాలు

ఒక బంగారు ఉంగరం, 4 వెండిపళ్లెలు, 1500 రూపాయల మందులు

| | |
|---|---|
| శ్రీ కె. బాలగోపాల్, వరంగల్ | + 15769.03 |
| శ్రీ కె. వెంకటరెడ్డి, ముద్దలపల్లి | 50.00 |
| శ్రీ సిఎచ్. గణపతి, విజయనగరం | 21.00 |
| శ్రీ పి ఎస్ నారాయణ, విజయనగరం | 20.00 |
| ఆర్ ఎస్‌యు, ఆర్ వై ఎల్ - విశాఖపట్నం | 30.00 |
| టెలికాం కార్మికులు, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్, తెనాలి | 50.00 |
| టెలికాం కార్మికులు, టెలిఫోన్ ఎక్స్ఛేంజ్, దుగ్గిరాల | 79.00 |
| డివాడ విరసం సాహిత్య పాఠశాల బహిరంగసభ వసూళ్ళు | 400.00 |
| మొత్తం రూ. | 16482 03 |

+ ఒక బంగారుఉంగరం, 4 వెండిపళ్లెలు, 1500 రూపాయల మందులు

గిరిజన సహాయనిధి వి. వరవరరావుపేర స్టేట్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, రంగల్ బ్రాంచ్‌లో ఉంది- అకౌంట్ నంబర్ 2730

**SRJANA Telugu Monthly** Nov. 81 H/WL-10
Regd. No. with Registrar of Newspapers 10953/67.

# ప్రజలకు విజ్ఞప్తి

వందమందిపైగా గోండులప్రాణాలు బలిగొన్న ఇంద్రవెల్లి పాశవిక దమన కాండ జరిగి ఆరునెలలు దాటింది. గోండులునివసించే ఆదిలాబాదు జిల్లాలోని విస్తారమైన గిరిజనప్రాంతాలపై పోలీసు భీభత్సంఇంకా కొనసాగుతూనేవున్నది. గోండులింకా ప్రభుత్వ ఉక్కుపాదాలకిందే నలుగుతున్నారు. ఈ సంఘటనపై దేశవ్యాప్తమైన నిరసన పెల్లుబికింది. ఆదివాసులపై ప్రభుత్వ పాశవికచర్యను ప్రజాస్వామ్యాన్ని ప్రేమించే ప్రజలంతా ఖండించారు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కులసంఘం నియమించిన నిజనిరూపణకమిటీ ఈసంఘటనను జలియన్‌వాలాబాగ్ ఉదంతంతో పోల్చింది.

నిరుపేద గిరిజనులపై ప్రేమనొలకబోసే ప్రభుత్వం మరణించినవారి కుటుంబాలకు ఎక్స్‌గ్రేషియా చెల్లిస్తానని ప్రకటించింది. అయితే ఈ నామమాత్రమైన సహాయంకూడ ఇప్పటికీ బాధితులకు అందలేదు. సహజంగానే, అన్ని ప్రభుత్వ పథకాల్లాగే ఇదికూడ కలవారి ఖజానాలు నిండడానికే ఉపయోగపడ్డది. ఈ పరిస్థితుల్లో పోరాడుతున్న గిరిజనులకు నైతికసహకారాన్ని అందించడం మాత్రమే కాకుండా, పేద ఆదివాసులకు సహాయంచేస్తున్న స్వచ్ఛంద సంస్థయైన "ఆదిలాబాదు గిరిజన సహాయనిధి"కి ఉదారంగా విరాళాలు ఇవ్వడం ప్రజలబాధ్యత.

ఆదిలాబాదు గిరిజన సహాయనిధి,
C/o సృజన, హనుమకొండ,
506 001

బి. ప్రదీప్
ప్రధాన కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం